

# గౌ॥ బెజవాడ గోపాలరెడ్డికి

నీ పెండ్లి సర్వ మంకితమును జేసితి
గోపాలోదాహరణమ్మును
నీ ప్రధాన మంత్రిత్వ
శ్రీ పరిణత శుభ వేళను
ఈ పాముపాట నిచ్చెద
దీపిత సంగీతకృతిని
ఆ రవీంద్రు శిష్యత్వము
నా రవీంద్రు తారముగా
తెనుగు చేసి యందిచ్చితి
పునుగుతోడి తిలకమువలె
వంగకవి జగచ్చంద్రుని
సంగీతాత్మయ్యెఁబోలెఁ దె
లుంగు కవి జగచ్చంద్రుని
సంగీతాత్మయు నీయెడ
సంగీకృతి నెఱపెనోయి!
భృంగీ మధురావంబుల

# పాము పాట

(సంగీత రూపకము)

## తొలి రంగము

స్థలము:- ఒకవీధి. ఒకగ్రామములో

త్రైలోక్యసుందరి:

నీ వెవ్వ రని నన్ను నెలతలారా! మీరు
గుమిగూడి యడిగెదరు గుసగుసలు పోయెదరు
కాంతిమాచిన రాచకన్నెలా తోఁచెడిని
వింతగా మెయినిండ వెలిబూది పూసినది
ఒక్కపాముల బుట్ట నొత్తి నెత్తినబెట్టి
సారబుద్ధి లేకుండ తిరుగుచుండె నటంచు
నావంక గనుగొంచు నలినాక్షి యొకర్తు

మడచి క్రీఁబెదవి వమ్మతిలేక పరిశోడిసి
నీళ్ళునిండిన కడవ నెలత యొక్కతె చంక
నిడికొని నావంక నెకసక్కెముగఁ జూచు
అంగనామణి యోర్తు రింగుబువారగా
క్రీఁగంటనను తిరస్కృతిమీరి గాంచెడిసి
అకట మీ రనుకొన్నయట్లుగా కానమ్మ
ఆదరమ్మున విందు రా యేసి చెప్పెదను
సౌరాష్ట్రదేశంబు చానలారా! మాది
ఆరాజు నాతండ్రి యతడు రత్నాంగదుడు
నాతల్లి నాతండ్రి నన్నుదిగ నిచ్చిరా
చేతులందుంచి పెంచిరె పైడిబొమ్మగా
అల్లారుముద్దుగా నారీతి పెంచబడి
తల్లులారా! యిట్టి దశపొందితిని నేడు
ఎవ్వారికేనాటి కేది వ్రాసెనొవిధి
ఎవ్వరికైన తానెట్లుగా తెలియునే!

నాగమ్మ :

( పాట )

నమ్మటానికి వీలులేదమ్మా ॥నిమాట॥

నమ్మకము కలిగించలేదమ్మా
కొమ్మయొచ్చటనైన క్షోణిపతికూతురిటు
దిమ్మరై దేశాల తిరుగుచుండుట కలదే? ॥నమ్మటానికి॥

లక్ష్మమ్మ:

చాప చెడినదనుగాని చదరయాగదవమ్మ
ఊపగిది రాచవారింటి యాముదియాన ॥నమ్మటానికి॥

త్రైలోక్యసుందరి:

తొలినుండి తుదిదాక తోయజేక్షణలార
కలరూపు వినియుష్ట కాదనవలెగాని
మొదలుపెట్టకమున్నె మది నమ్మకము మాకు
కుదురలేదనుట మీకును న్యాయ మగునమ్మ?

నాగమ్మ:

వినెదము తుదిదాక వినిపింపు మమ్మా!
కనెదము నీమాట కల్లయో నిజమో;
బుట్టలోపల పాము పట్టి తెచ్చితివి

మడచి క్రిందైదవి వమ్మతిలేక వెరిసేడిసి
నీళ్ళుసండిన కడవ నెలత నెత్తికెత్తె చంక
నిడికొని నావంక నెకసక్కెముగఁ జూచు
అంగనామణి యోర్తు రింగులువారగా
క్రిగంటనను తిరస్కృతిమీరి గాంచెడిసి
అకట మీ రనుకొన్నయట్లుగా కానమ్మ
ఆదరమ్మున వింటు రా యేసి చెప్పెదను
సౌరాష్ట్రదేశంబు చానలారా! మాది
ఆరాజు నాతండ్రి యతడు రత్నాంగదుడు
నాతల్లి నాతండ్రి నన్నుదిగ నిచ్చిరా
చేతులందుంచి పెంచిరె పైడిబొమ్మగా
అల్లారుముద్దుగా నాకీతి పెంచబడి
తల్లులారా! యిట్టి దశపొందితిని నేడు
ఎవ్వారికేనాటి కేది వ్రాసెనో విధి
ఎవ్వరికైన తానెట్లుగా తెలియునే!

నాగమ్మ:

(పాట)

నమ్మటానికి వీలులేదమ్మా ॥నీమాట॥

నమ్మకము కలిగించలేదమ్మా
కొమ్మయెచ్చటనైన క్షోణిపతికూతురిటు
దిమ్మరై దేశాల తిరుగుచుండుట కలదె? ॥నమ్మటానికి॥

లక్ష్మమ్మ:

చాప చెడినదిగాని చదరయా గదవమ్మ
ఈపగిది రాచవారింటి యాడుదియానె ॥నమ్మటానికి॥

త్రైలోక్యసుందరి:

తొలినుండి తుదిదాక తోయజేక్షణలారా
కలరూపు వినియప్డు కాదనవలెగాని
మొదలుపెట్టకమున్నె మది నమ్మకము మాకు
కుదురలేదనుట మీకును న్యాయ మగునమ్మ?

నాగమ్మ:

వినెదము తుదిదాక వినిపింపు మమ్మా!
కనెదము నీమాట కల్లయో నిజమొ;
బుట్టలోపల పాము పట్టి తెచ్చితివి

ఎట్టులో నమ్మ్రట యెరుగరాదయ్యో
అయిన చెప్పగనైన యవియెల్ల చెప్పి
మానవతుల్ మీరు మాటాడవలదు

త్రైలోక్య సుందరి:

ఇవ్వురులోపల సన్నయీనె తోచినయట్లు
కవురు నామెయి వింతకాంతి తోచినదమ్మ
లేమావి పూచినలీల నాకనుతుదఁ
లేమలారా! పిసాళించెనే జిగులతో
అదిచూచి నా తండ్రి అంబుజేక్షణలార!
మదినెంచె నొక రాకుమారున కీయంగ

నాగమ్మ:

( పా ట )

సొగసుల సొగసుల పలుకుల
సొగటాలాడకు బాలా;
కతయేమో తొందరగా చెప్పుము
నతాలకావలి రమాహేలా ॥సొగసు॥

## త్రైలోక్యసుందరి:

కాశ్మీరదేశాన కనకాపురం బేలు
ధర్మాంగదుం డన్న ధారుణీనాయకుడు
సరగ తత్పుత్రునకును సంబంధమును వెదుక
ధరణిదేవతలు నాతండ్రి దగ్గర వచ్చి
నను జూచి సర్వలక్షణములు నాకు
అతనికి సరిపోయె నని నన్ను నడుగ
ధర్మాంగదుడు మహాధర్మాత్ముఁ డనుమాట
అందరు నెఱిగినదే దాన నాతండ్రి
నన్నిత్తు నని చెప్పినా డమ్మ సతులార!
కన్నులందున సిగ్గు కలుగఁగా నను జూచి.

## లక్ష్మమ్మ:

అంత రాజు కోడలవా ?
ఇంతీ యీదశ యేమిటి?
పుంతలు పుట్టల గుట్టల
పురుగు పుట్ర మోసెదవే

త్రైలోక్యసుందరి :

అంత రాజు కోడలనై
అంత రాజుకూతురనై
ఇంతీ నీ వన్నట్టుల
యీ దశ పట్టినది నాకు

నాగమ్మ :

తరువాత జరిగినదాని చెప్పగదె
సరె యిత్తునన్నాడు జనకుండు నిన్ను
అతని ముకుట మొగమ్ము నరయకుండగనె
అతనిపై వలపు నీ కంకురించినది

త్రైలోక్యసుందరి :

తరువాత నే నాట జరుగని పోకడల్
జరిగెనే నాతల్లి జరిగె నెన్నో కథలు
తరలి వచ్చిరిని వందలమంది పెండ్లి వా
రరుణాయతేక్షణలార సాగర మట్లు

అసలు పెండ్లికుమారు డరుదెంచనేలేదు
నుసలక వారన్నమాట లబ్బుర మయ్యో
వారింటిలో కానువాఋత లేదంట
ఔర పెండ్లికుమూరు డరుదెంచు టన్నది
కత్తికి మరి బాసికము కట్టినారమ్మ
పైడి కత్తికి తలంబ్రాలు పోసితి నమ్మ
కత్తికే మాతండ్రి కాళులు గడిగెను
కత్తికే మాతండ్రి కట్నాలు చదివించె
ఆనాడు నాబ్రతు కయ్యెయో నగుబాట్ల
కైనదే నా తల్లులార! యే మని చెప్ప

నాగమ్మ:

(పాట)

అబ్బురము లేదమ్మ యిందూ – పెండ్లిండ్లు
ఆకీతి జరుగు నందందూ
మాయూరి రాచకుమారైకి ఖ్లే జరిగె
నా యమ్మమగడు యోధానుయోధుడు సువ్వే! ॥అబ్బు॥

లక్ష్మమ్మ :

అట్లే నీ మగడుకూడ
నధికుండై యుండవలయు
గట్లు పొంగునది విధాన
కాల్వలు కట్టెదవుగాని

నాగమ్మ :

చెప్పదలచినయట్టి కథయంతా
చెప్పనీయుం డమ్మ చెలు లంతా
ఎప్పటప్పటి కడ్డమైనంతా
తప్పిపోదుము వినగ నీ వింతా!

త్రైలోక్యసుందరి :

అత్తవారింటికే నరిగినా నాశ్నైసి
అత్తమామలు నన్ను ఆదరించినరీతి
చిత్తమం దిపుడైన చింతజేసితినేని
అత్త మిల్లెడు మోహానానంద వీచికలు

అంత బ్రహ్మానంద మయ్యో నా మగవాడు
సుంత చూచుటకైన చూడగా రాడయ్యో
అతనిమాట గృహాన నన్నవారే లేరు
కుతిలపడి యతని ననుకొన్నవారే లేరు
ఎవరైన ననుజూచి యే మనుకొందురో
ఔర నాభర్త యేడని యెట్లు అడుగుదు
పడతులారా! ముళ్ళపై నున్నయ ట్లయ్యో
గడియ యుగమ్ముగా గడచె నా ప్రొద్దెల్ల
ఎంత దీర్ఘముగాగ నెసలారె నాకోర్కె
అంతగా ప్రొద్దు వాటాకు నీడలుసాగ
ప్రొద్దుక్రుంకిన యంత ముస్తాబు చేసికొని
ముద్దియలార! నే మురియుచుంటిగదమ్మ.

నాగమ్మ :

( పాట )

ఏమేమిరా నగలే — ఓ రాచకన్నె
ఏమిరా తాల్చితివే
మీరా రాచవారీ — నగలెల్ల

మేలూగా చెప్పవే — వినుటకును
నా చెవులూ నారీ — పొంచుకొని
నారాచములుగా — నిలచినవి — ॥ఏమేమి నగలే!

నాగమ్మ :

రాచవారి కేమమ్మా — నగలవి
తోచినన్ని కలవమ్మా — ఎచ్చట నెది
చూచినంత చాలునుగద — నిముసములో
సొమ్ములు చేయించుకొంద్రు ॥రాచవారి కేమమ్మా॥

త్రైలోక్యసుందరి :

రత్నాలు చెక్కిన రాగిడీ శశిపూవు
చేర్పుక్కబొట్టుతో చెన్నొందు శశివంక
పాపటబంతీలు బవిరెయా చెవిపూవు
దుద్దులు జమకాలు మద్దికాయలు రాళ్ళ
చిమ్మటి బావిలీల్ చిన్నారి నీలాలు
కోసల బావిలీల్ కొప్పులగొలుసులు
మీల్ బుటారైకయు మురుగులు గొలుసులు

ముకుడీలు పోచీలు ముందరిగాజులు
బాజు బొందులు మరి బాగైన కడియాలు
గొప్ప కుత్తిగంటు కొసతేరు నడ్డిగలు
నవరత్నహారాలు నవచంద్ర హారాలు
చిలుకల తాళీలు గిలుక సరిపేటలును
పులిగోరు పతకమ్ము వరహాలపేరులు
మేల్మిబంగరుబేరు కారాణిగుళ్ళును
మిరియాలబేరులు నల్లపూసల దండ
సంకుపూసలపేరు సన్న ముత్తెపుపేరు
పద్మాలు దిద్దిన పట్టు తాబొందులును
సింహామధ్యము బోలు చిన్నారి నడుమునకు
నూలు వడ్డాణమ్ము రాలవడ్డాణమ్ము
గంట లొడ్డాణమ్ము క్రాలు వడ్డాణమ్ము
చిలుక వడ్డాణమ్ము జీరు వడ్డాణమ్ము
ఆపైన పాదముల యందో నెలతలారా!
అందెలు మువ్వలు అనువైన పిల్లేళ్ళు
పాంజీరులను తొడిగి పావడాలనుబెట్టి
తుమ్మకాయలుపెట్టి తోరమ్ముగా నంత

అడిగినా రసి మీారలవి చెప్పితిస గాని
పడతులారా! అవ్వేభావమ్ము నందున
ఇపుడు తోచినయంత యేమందు గుండెలో
ప్రాయ్యిరా జేసిన పొలుపుగా నున్నదే
అంతటి ముస్తాబు వ్యర్థమైపోయెనే
బూదియరాశిలో పోసిన పన్నీరు
నాకైన ముస్తాబుకంటె వాసనగలది

నాగమ్మ:

ఏమికష్టము వచ్చెనమ్మా - నాతల్లి
నీ మనసులో నింత నెగులు నెకొనుటకై - ఏమి

త్రైలోక్యసుందరి:

రెండుజాములు దాటె రే నందఱును నిద్ర
పండుకొన్నారు నాభర్త జాడయెలేదు
అపుడు సిగ్గున నిద్రపోనా - సతులార!
అత్తమామల నడుగునా!
ఇదిఃఆకు నాభర్త నేజూచి యున్నచో

నాకర్మ మనుకొందుగానీ - పూర్వమ్ము
అతని చూడక యుంటచేతా - పగ లెల్ల
అతనిపాడయే లేనిచేతా - ఎవ్వరును
అతనిఊసే లేనిచేతా - మనసులో
ఆందోళనము గల్గి యర్ధరాత్రము వేళ
అత్తమామల లేపినానూ సతులార!
అత్మ భర్తను అడిగినానూ.

లక్ష్మమ్మ :

దొంగపెళ్ళి చేసినారో
తోయజాక్షి నీకు వారు
అంగజాతు ములికివంటి
అంగనా శిరోమణికిని

నాగమ్మ :

ఏమన్నా రేమన్నా
రేమన్నా రమ్మా ?

త్రైలోక్యసుందరి:

అనుగరాని దాని నడిగినట్లుగ నేను
ఒకరి మొగము చూచు చొకరు నిలువబడిరి
మెలతలార! యింట మేలుకనియ యుండి
కలతలేక దాను లచట నచట నక్కి
అపుడు నా కపస్మారకము కలిగెనే
అంతలోపల కోప మరుదెంచెనే
కత్తికి బాసికము కట్టించినారూ
ఉత్తమాటలు చెప్పి ఉరిబెట్టినారూ
రేపు మాపని చెప్పి త్రోపెట్ట నేను
మగవాని చూపించి మరి కదలు డంటి

నాగమ్మ:

బలేగా అన్నావు బాలామణీ!
సరే యేమియన్నా రసాధుల్ చెలీ! వారు

త్రైలోక్యసుందరి:

(పాట)

రయంబార నన్ను కంచు కన్నులందు
రాజీవాక్షులారా!
భయంబంది అంతబాజు అంతరాణి
పద్మాపాంగలారా!
అయ్యో తల్లి యేమి చెప్పవలయు నమ్మ
అంచూ రాజురాణీ
దయాధీనదృక్కు లంత పలికి వారు
తెల్లాడిల్లినారూ.

లక్ష్మమ్మ:

ఇది బాగున్నదిలే
ఇంతీ! నీ పతి చూపక
ఎంతో బాల్లి యేడుపు లేమ్పట
ఇద బాగున్నదిలే

త్రైలోక్య సుందరి :

ఒక్కగది చూపించి ఉవిదరో నీ భర్త
అక్కడ నున్నా డటంచు చెప్పిరి నాకు
గదిలోన కేగి నల్గడల జూచితిగాని
కదలిక యున్నది కన్పించ దచ్చోట

నాగమ్మ :

మఱల పోయి యడుగక పోయితివా?
మగువా! చూపించుడు నామగని నీని మేమ మంద
యంచును ॥మఱల॥

రగడ చేసి యూరెల్లను
రమణీ! చేసిన యన్యాయము
తెగునా? ధర్మాంగద రాజువంటి
ధర్మాత్ముల కని వీధినిబడి ॥మఱలపోయి॥

త్రైలోక్య సుందరి :

అట్టులే చేసియుండెద నేమొ నేను
అధికమ్ము చేసియుండెద నేమొ నేను

ఓ పతివ్రతలార! ఓ తల్లులార!
ఓ భారతీయ స్త్రీభద్రలార!
ఇంతలో నా చెవికి నే మూలనోయుండి
వింతయౌ నీలగా వినిపించె నమ్మా!
ఆ యీల నా గుండెలోయలో దూరాన
కోయిలకూతగా కుసిలించె నమ్మా!
ఆ యీల నా గుండె యంతరాంతరమందు
మ్రోయించె నమ్మ సమ్మగ్ధ వేణువులు
ఆ యీల నా గుండె యవిసి ముక్కలలోన
హాసించె నమ్మ సంపంగివాసనలు
కడలందు పరికించి కనుగొంటి కనుగొంటి
పడతులారా! నెత్తిపై నున్న యీబుట్ట

నాగమ్మ:

పాముబుస్సులు కొట్ట పతియీలవలె నీకు
వినిపించెనా
ఆపైన నే మైనదే
ఏ మైనదో చెప్పవే యెమ్మెలాడీ!

త్రైలోక్యసుందరి:

ప్రాణేశ్వరిని వచ్చి పతి కౌగిటంబూను
పగిది నిది పెనవేసి పట్టె నీ భుజగమ్ము
నా గుండెలోన మానవతులారా! భీతి
యే గల్గదాయె నదేమి చిత్రమొగాని

నాగమ్మ:

పూర్వజన్మలో నీ వేమొ
భుజగాంగనవే సుందరీ!
నీకై వెదకుచు నీ మగ డేమొ
నీకై వచ్చెనె సుందరీ!

త్రైలోక్యసుందరి:

మఱి యంతలో నత్తమామలు వచ్చి
తరుణులారా! నన్ను తమ బిడ్డనుంగాంచి
మురిసిపోయిరి భీతి మునిగిపోయిరి దుఃఖ
భరముచే నురిసిపోయిరి జాలిపడినారు

లక్ష్మమ్మ :

పతి యంత నచ్చితే పాముటిల్లాలా!
మరి యిల్లు వదలగా మన్నించి తేలా!
పాము మసలకాలలకు పట్టుపాన్పులు తగవా?
కామినీ కొండలును కానలునువలెనో ॥పతియంత॥

త్రైలోక్యసుందరి :

పరాచికము లే లమ్మా భామలాగ నాతో ?

నాగమ్మ :

నవ్వేచు నన్నది కానీ అవ్వలి కథ చెప్ప వమ్మ
చిలవలు పలవలుగా నో
చెలువ! నీదుకథ నడచెడు — నవ్వేచు నన్నది

త్రైలోక్యసుందరి :

సంతానము లేకపోయి
చింతాక్రాంత మనస్కులు

ఎంతో యారాటం పడి
ఇంతులార! పరితపింప
కొన్నాళ్ళకు మా యత్తకు
సన్న సన్న గర్భం బౌ
చిన్నెలు కనిపించె మామ
మిన్ను ముట్టి మురిసిపోవ
నవమాసంబులు నిండిన
నాగరాజు లుదయించిరి
అబ్బబ్బా రాజు రాణి
గుబ్బిస లాడుచు నుండగ
ఇదియేమి చిత్రమే ఇదియేమి కర్మమే ?
తొలుత గర్భములోన మెలికలై తిరిగెనే
అదవ పామని త్రోయ నాగదే మనసులో
ఇదియేమి కడుపుతీపెంతటి కాంతయో!

నాగమ్మ:

(పాట)

కడుపు తీపంతే నమ్మా!
కడుపు తీపంతేలే
రాయిగాని రప్పగాని
రమణీ కడుపున బుట్టిన
బ్రతుకులోని పరమార్థము పడసిన యట్లేయుండును.
॥కడుపుతీపం॥

లక్ష్మమ్మ:

ఊరు ఊరంతటను గుప్పు మనలేదా?
పాము పుట్టిన దంచు పడతిరో యిపుడు
అది యెట్లు దాచిరే యంభోజనేత్రా!
నీ కెట్లు తెలియలేదే? కోమలాంగీ!

త్రైలోక్యసుందరి:

వారి మంత్రి యున్నాడొక డారా యొక యుగంధరుడు
ఊరిలోన కిక్కురు మన లే దొక్కడు తెలిసె నేస

అంత కప్పిప్పుచ్చినారె యీ వార్తను నగరిలోన
అంతకు మా మామగారి యౌదార్యము కారణమై

నాగమ్మ :

( పాట )

పాము పుట్టిన దనుట సరియే బాలా!
పామునకు పెండ్లెట్లు చేశారే?
ఆ మామ పొగడలే కస్తుపిస్త య్యేవు
ఏమిపని యిది చెప్పవే — మగ డన్న
నీ మక్కువే చిత్రమే!

త్రైలోక్యసుందరి :

త్రికాలవేదులు బ్రాహ్మణు లంతట
భుజంగపతి జాతకమును చూచిరి
వివాహ మాతనికిని చేసినచో
మనుష్యు డగు నని చెప్పినార లట
సౌరాష్ట్ర దేశంపు భూనాథు కూతురు
త్రైలోక్యసుందరీ తా భార్య యగు నని

ఆయమ్మ యీ పాము నొదలం దాల్చికొని
వేయి క్షేత్రములలో విహరింపఁబోవు నసి
ఒకచోట నీ పాము రాజకుమారుడై
సకియయు నతడును సౌఖ్య మందెద రసి
అని చెప్పినా రటే యీ బ్రహ్మవేత్తలు
అన్నా రనుచు చెప్పి ర త్త మామలును

లక్ష్మమ్మ:

ని న్నేదో యనుకొంటిమి
అన్నా! క్షమియింప వమ్మ
ఇ న్నాథుని కైకొని చని
ఎన్ని క్షేత్రముల కేగితో

త్రైలోక్యసుందరి:
(పాట)

ఆశీర్వదించు డమ్మా! నను మీరు ఆశీర్వదించు డమ్మా!!
సౌభాగ్యవతులైన సతులదీవనలతో

సాధ్యమ్ముకాని దే మమ్మా సతులార!
ఆశీర్వదించు డమ్మా!

ఇ ద్ద రు :

బ్రాహ్మణులే అట్లాడిన పడతీ నీ వొక వేల్పువు
భగవంతుని యుద్దేశ్యమె ముగుదా అ ట్లున్నదికన
మాదీవన లేమి కొఱత
మగువా క్షేత్రము లేగుమా
చిలువరాజు మానవుఁగ
చేసికొనవె మాయమ్మా!
సెల విప్పింపవె నాకును
చెలువా మము మఱచిపోకు

# పాము పాట

## (సంగీత రూపకము)

### మలి రంగము

స్థలము:- ఒక అడవి

త్రైలోక్యసుందరి:

నలినాక్షు లందఱును నను వదలి చనినారు
కలిసి బంధుగులట్లు పలుకరించనవారు
ఎన్నెన్ని క్షేత్రమ్ము లేగితినొ యీపటికి
చిన్న నా స్వామికి చిలువరూపము పోదు
బుట్టలోపలి స్వామి బుస కొట్టుచున్నాడు
అట్టి యాకలి వేయు ననుకొందు నీయనకు
ఏ యింట నైన పాలిప్పించు డని నేను

పోయి తప్పక యమునగఁబోయి నీ పాటికిని
బుట్టసింపితి గాలి పోసికో నయ్యా!
బెట్టుసేయుకు పడగ విప్పి లేవయ్యా!
అదిగో; అదే స్వామి యదియె వద్దన్నాను
కదియఁబడి కంఠమ్ము కౌగిలించగబోకు
పాడిగోంచు బుగ్గపై ముద్దు లిడఁనట్లుగా
ఇనునాల్క లాపించి యూల వేయఁగఁబోకు
ఎవరైన చూచి పోయెద రయ్యా నా స్వామి!
సౌరింత నీ పాపజాతికి సరిపోయె
అదిగో అల్లంతలో అంతటి కోపమ్ము
ఒదిగి పోయినట్టు లూరకయె ప్రాలెదవు
పామైన నీతోనె బ్రతుకలే కున్నాను
ప్రభు రాచబిడ్డవై బ్రతుక నిత్తువె నీవు
నలుసంతమాట యన్నా నని కోపమె
కులకాంత యింత మాత్రముకూడ ననరాదొ
ప్రభు! నీకు యిష్టమ్ము వచ్చినట్లే యుండు
చీమంత యనరాదొ చిలువరాజను నిన్ను
నవ్వుచు నన్నాను నాగరాజా! అంత

నాకుమాత్రము ప్రేమ లేకపోయెనే స్వామి!
ఇదిగో! కోపము పోవునది యిప్పుడు నీకును
కదలించెదవు సన్నగా ఫణాబింబమ్ము
ఓ నాగరాజా: సహించకోయ్
తలపై పడగవిప్పి తగ రాగిడివోలె
అప్పళించెదు స్వామి అది చాలులేవోయ్
ఓ నాగరాజా! కుసిలించకోయ్
పారాడి కురులపై పాపటబిళ్ళగా
నొసట వ్రాలెదు స్వామి దూసికిల్లవోయ్
ఓ నాగరాజా! ఇది చాలుతేవోయ్
నడుమునకు చుట్టుకొని నగల యొడ్డాణమ్ము
జిగిజీవరేఖ పడగవిప్పి నను చూచెదవు
ఓ నాగరాజా! వదలించవోయ్
ఎవరో వచ్చెదరయ్యా!
వదలవయ్యా నా స్వామి
ఎవరో వచ్చెడివారలు ఋషులవలె కనిపింతురు
తగిలి నీవు మానవుడవుటకు
దారి యేదో చెప్పెదరేమొ! ॥ఎవరో వచ్చెదరయ్యా॥

(ఒక ఋషి ప్రవేశము)

త్రైలోక్యసుందరి:

నమస్కార మయ్య స్వామి నలిననూతి సమ తేజా!
నమస్కార మయ్య శోకజలధిమగ్న సురభూజా!

ఋషి:

(కీర్తన)

ఒంటిగా నీ యడవి నేగెదవా ఓ యందకత్తె!
వెంటనే యెవరైన లేరమ్మా?
కంటి కచ్చరవోలె కనిపించెదవు నీవు
దంట. ఒక్కతెవు కాంతారమ్ములం దేగ ||ఒంటిగా||
ఎవరమ్మ నీవు మీ యింటియాయన యెవరు?
నవలామణీ నీవు నాగకన్యక వేమొ ||ఒంటిగా||

త్రైలోక్యసుందరి:

ఓ మహాఋషి రాజ! యురగకన్యను గాను
స్వామి సౌరాష్ట్ర భూజానికూఁతుర నయ్యా

ఒంటిగా నీ యడవి తిరిగెదనూ! నా భర్త
కంటివా యీ భుజంగమురాజుగానూ
ఇతని జాతకములో నితనికి భార్యనై
ఇతనిని మనిషిగా నేను చేసెద నంట.
ఒంటిగా ఈశాన నేనూ తిరిగెదను
జంటగా పతిచేసికోనూ

ఋషి:

లోలాక్షి నీవు త్రైలోక్యసుందరి వగుదు
వీలాగు పామువై యెత్తంగ నొకజన్మ

త్రైలోక్య సుందరి:

ఓ త్రికాలవేదీ! ఋషిపతీ!
ఓ యథార్థవాదీ! ఋషిపతీ!
నా పురాకృతమ్మూ! ఓ ప్రభు
ఓపరాని దెట్లూ? ఓ ప్రభు
నీ పదాంబుజములా వ్రాలెద
ఆపవే యఘమ్మూ! ఋషిపతి ॥ఓ త్రికాలవేదీ॥

(కాళ్ళపై బడును)

ఋషి:

ఓ కాంత నీమీద నుదయించె జాలి
ఇంత లేవగదమ్మ ఈ కాళ్ళు వదలి
నిన్ను నీభర్తను నెలత స్వర్గమున
మున్ను శపియించెనే మునియొక్కరుండు
అతడు శాంతించియో యతివరో తుదకు
అతివ శాపాంతమ్మునాడె యీ పగిది.

త్రైలోక్యసుందరి:

(కీర్తన)

అదియేమి దోసగూ మానికోపా
స్పదమైన దోసగూ తెలియగ పలుకు స్వామి -
అదయేమిదోసగూ
తొలిజన్మలోన బుద్ధులు లేవెమాకూ మానిజనా
వలియుండు భక్తిలోపము పొందుటకునూ -
అదియేమి దోసగూ

ఋషి:

నీ తప్పు లేదమ్మ నెలతరో యందులో
మగుడ నీ భర్త కాముకత కారణ ముందు
మున్ను గంధర్వులే మగుడ మీా రిద్దఱును
ఎన్నంగ నీభర్త యెంతయో గాయకుడు
సంగీత విషయమున చాన నీ భర్తకును
శృంగియ న్పే రొప్పు ఋషికి వివాదంబు
కలిగి నీభర్త యంగన మౌని నోడించి
గెలుపు గర్వమున నా కెలన నుండిన నిన్ను
సభలోన చెక్కిట చానరో ముద్దిడె
సభలోన నందఱు చానరో నవ్వగా
అది చూచి శృంగి కోపాటోపమున రేగి
పొదలలో పామువై పుట్టుమని శపియించె

త్రైలోక్యసుందరి:

పొదలోపలి పాముకాదు
గద నా మగవాడు స్వామి

త్రిదివేశ్వరునివంటి రాజ
సదనంబున జన్మించెను.

ఋషి :

స్వర్గములో మీ యిద్దఱి సరసములు ప్రసిద్ధములు
స్వర్గములో మీ యిద్దఱి వలపులును ప్రసిద్ధములు
వినను నీ వినయమ్మును నందము పాతివ్రత్యమ్మ
మానసమున నందఱకును మన్నన కలిగించిన యువి
పాలతి ఋషీశ్వర పాదాంభోజమ్ములపై వ్రాలితి
లలితములౌ పలుకులతో లాలనగా బ్రతిమాలితి
ఆ ఋషి కోప మ్మడిగి దురాత్మా! నిను క్షమియించితి
ధారుణి నాథుని మణిగృహధాత్రి పుట్టు మని చెప్పెను
నీ వప్పుడు ముసరాప్పుద నీరజాతములు వదలక
నీవు నచట జన్మించగ నిన్ను చెట్టు మని కోరితి
నిన్ను పతివ్రత గన్గొని నీరజాత నిభ్రుతాక్షి
నీ వీ గతి భర్త బ్రతుకు నిర్మించగ ముని యాడెను

త్రైలోక్యసుందరి :

మునీంద్రచంద్ర! యెన్ని తీర్థములను మున్గినానో

ఫణీంద్రరూప మితడుగాని పాయునట్లు లేదే
మునీంద్రుడైన శృంగిమాట మోసమేమో యోప్రభూ!
కనగి కనులనీళ్లు తుడువగా వచించె నేమొకో!

ఋషి :

అతనిమాట వమ్ముకాదె యంభోజాయతలోచన
పతిని మనసి చేసికొందు ఫాలామృత కిరణకలా!

త్రైలోక్యసుందరి :
( కీర్తన )

ముని జగత్పతివి! నుతమతి - నా తండ్రి నీ
మృదుపదాశ్రితను మునిపతీ!
కృపగనే దారి వటంచు
నవపథమునుండి నేను
ఇపుడె యాశ్రయించినాను ఏలవే మునిపతీ ॥ముని॥
ఎన్నినదుల గ్రుంకినానో
యెరుగ నయ్య మానిరాజ!
నిన్ను వదలి దిక్కు లేదు నిలుపవే మునిపతీ ॥ముని॥

ఋషి :

కాలము పండగవలెనే కార్యమ్ములు ఫలియించగ
కాలాహి నరుం డగుటకు కాలగళుని దయ కావలె
ఇచటికి నొక యామడలో నెసగు బ్రహ్మగుండ మనుచు
ప్రచిత మహాసుకృతమ్ముల పాదైన మహాక్షేత్రము
శివుడు పూర్వ మచట తపసుచేసి కాలకూటవహ్ని
కవురు కుత్తుకందు నిలిపె కంజాత సుధాలోచనా!
అచట బ్రహ్మగుండమందు అహిరాజును మునిగింపుము
పరమ రాజపురుషు డట్లు బయటవచ్చు నీ పురుషుడు
( కనిపించకుండ పోవును )

త్రైలోక్యసుందరి :

ఇంతలో కనిపిత్తు రింతలో కనిపించ
రెంతో తేజశ్శాలు రీ మహాఋషులు
కాలమ్ము పంట యాకారమందిన యట్లు
శాలీన నవజటా సస్యమంజరులు
నా కష్టములు మాసినాథకృపామతి

క్షేత్రమ్ములో పంటచేసి కొగ్గినవి
నాహిం శాపాంత దినము లాసన్నమై
వినాఘుస మితిజల్లించగాబడియె
పాములుసంతి భావ్ర కమ్ములూమరి
కాము భాపమునకు ఖను కాటచేస
గంధరు డైయుంత కాము కాడగోటచే
ముంధదమ్మగ పాముమాదిరియయ్యె
వికాసపములర్థ ముహితమ్మకాగదా
ఆబుద్ధి కామేను రనుకూలమైనట్లు

# పాము పాట

(సంగీత రూపకము)

## మూఁడవ రంగము

స్థలము:— ఒక శివాలయముముందు — బ్రహ్మగుండము.

త్రైలోక్యసుందరి:

ఇదె యెట్టయెదురుగా హృదయమ్మలో నున్న
భక్తిభావమ్ము రూపమ్ము కట్టినయట్టు
కనిపించెడు త్రిశూలకాంతిచే నాకాశ
ఘనమార్గ మిది మూఁడుగా చీలినట్లు

కొందరు భక్తులు:

(కీర్తన)

శివగిరిచాప విభో! విభో విభో.!
శివగిరిచాప విభో!

కనక భూమిధర కర్మచాప ధర
కామాక్షీ హృదయాధినాథ! గురు ॥శివగిరిచాప॥
భసితలేప మధురాభిరామ తను
బాలచంద్ర శకలాభిరామ శిర
వారాహీ కృత సేవ దేవగురు! ॥శివగిరిచాప॥
చాముండీ కర తాళ నాట్యపద
జలజమోహ నాకార గురు! గురు
శర్వాణీ మధురార్ధభాగ మృదు ॥శివగిరిచాప॥

(ఘంటా నాదములు)
త్రైలోక్య సుందరి :
(కీర్తన)

పాహిమాం శివ శంకర శ్రీకర
మేరు ధరాధర ధర దీనదయాళో!
పాహిమాం
ఘోరదనుజ కాంతార వైశ్వానరా
పారావార గంభీరా పరాత్పర
సారజలధి గంభీర మహేశా ॥పాహిమాం॥

స్వామి నాపతీ! యాకార మీ రీతిగ
సౌరా మారగా చేయు కృపాకరా!
నీకు చరణభక్తి నిలుపు మహేశా! ॥పాహిమాం॥
ఇది బ్రహ్మగుండమ్ము ఋషిరాజు చెప్పినది
ఇంతలో నా భర్త సంపు మీరగ ముంప
మానసి యీ నస మహనీయుడు వచించె
శంభో మహాదేవ సత్కృప చూపవే.
భుజగరాజా! నను చూడనీవయ్య
మునుక లాడకముందు భుజగరాజా!
ఋషి చెప్పినట్లూ నిజముగా మనిసి వైతే నీవు
నీమేని తలతలలు నే నింక కనలేను
నీవు నను ప్రేమగా
చుట్టలు వేసికొని సుడిగొను వైఖరుల్
నాకు కరవౌనూ నా స్వామి!
నాగరాజా! నిన్ను నగవోలె ధరియించి
ఇన్నాళ్ళు పార్వతి యేమైనా యనన్నేను
మన్నానయా
మనిసి వయ్యేద వంచు మదిలోన నా కోర్కె

యెంత యున్నదో స్వామి అంత దుఃఖము గలదు.
మనసివ్తైతే నన్ను మానిపోయెద నంచు
ఇప్పుడు నను వదలి యెచ్చట పోలేవు
అప్పుడు నిను నేను నాపగా నెట్లైను
నిను బ్రహ్మగుండాన నే ముంచ నే ముంచ
అహితోడ నీతోడ నఖిలసీమలయందు
సంచరించెదనూ!
సొరిది సిక్క మెడలోన సొంపుగా వేసికొని
సొక్కిపోయెదను

నా మేన నీవు సన్నగ ప్రాకుచుండగా
మోసులెత్తిన పసపుంతోటవలె నైన
నామేని పులకలు నాగరాజా! చూచి
కొని సంతసంపడు దినములు నా స్వామి!
వెళ్ళిపోయినవి.
ఏమి స్వార్థము నాది ఎన్నాళ్ళు నా స్వామి
పాముగా నుండగావలయు? నట్టులగాదు
బ్రహ్మ గుండములోని పాపరాజా నిన్ను

మునుక లెత్తించు చున్నాను మానిసిరూపు
పొందవయ్యా! ప్రభూ! పొందవయ్యా!

గంధర్వులు:
(కీర్తన)

అల ప్రజాపతి తొట్టతొలుతా – సృజియించె
తెలిపాములను నిరాకులతా – అపైన
పత్నులను సృజియించె పైన దీక్షితవాద
మహిమమ్ము వెలయించె మనుజలోకమునందు
క్షితికిని స్వర్గానికిని సచ్చెనలు కట్టె
తొలిసృష్టి పాములయ్యెగా – నిజముగా
మలిసృష్టి మనుజు లయ్యెగా
వితతముగ స్వఃపురీ వీధులందున లేని
సంగీత సాహిత్య సౌందర్య సారస్య వైశాల్య భావంబు
అప్సరస్సంతాన మాలపించెదరో
వితతముగ స్వఃపురీ వీధులందున లేని
శృంగార సామ్రాజ్య సౌభాగ్యసౌహార్ద రాశిక్య భావంబు
సురవిటావళి నిట్ట స్తుతియింతురో

# పా ము పా ట

(సంగీత రూపకము)

## తు ది రం గ ము

స్థలము :– శివాలయము ముందర.

త్రైలోక్యసుందరి :

జలధి మథించిన సమయంబందున
ధన్వంతరి యుదయించిన తెఱగున
హార కిరీట విహార మనోహర
చారుమూర్తి యుదయించెడు నా పతి
వేగుబోక తెలికాంతుల వాగుల
తూరి రేక విరియించిన పొలుపున
తమ్మిపూవు పసి దిమ్మచుట్టునను
క్రమ్ము తేనెవలె కదలెడు నాపతి

చిత్రాంగదుడు:

(ప్రవేశించి)

ఏ ఋషియో శపియించెను
ఏదో యేదో యైతిని
ఏదియు జ్ఞాపకము లేదు
ఇపు డిచ్చట నుదయించితి

త్రైలోక్యసుందరి:

కాశ్మీర దేశాధిపతి ధర్మ రూపుండు
ధర్మాంగదుండు తత్తనయుడ వీవు

చిత్రాంగదుడు:

కాశ్మీర దేశాధిపతి ధర్మ రూపుండు
ధర్మాంగదుండు తత్తనయుడ నేను

త్రైలోక్యసుందరి:

అర్మిలీదేవి మీయమ్మ మహారాణి
నీ పేరు చిత్రాంగదుడు యువరాజవు

చిత్రాంగదుడు:

అశ్మలీదేవి మాయమ్మ మహారాణి
నా పేరు చిత్రాంగదుడు యువరాజను

త్రైలోక్యసుందరి:

సౌరాష్ట్ర దేశ భూజాని రుక్మాంగదుడు
ఆయన కూతురు త్రైలోక్యసుందరి
ఆమె నీ భార్య చిత్రాంగద భూపాల!

చిత్రాంగదుడు:

సౌరాష్ట్ర దేశ భూజాని రుక్మాంగదుడు
ఆయన కూతురు త్రైలోక్యసుందరి
ఆమె నా భార్య నా ఆత్మలో వెలుగు
ఆ నా త్రైలోక్యసుందరి
అంగనామణి యెచట నున్నది?

త్రైలోక్యసుందరి:

ఆ నీ త్రైలోక్యసుందరి
అంగనామణి నేన స్వామి!

చిత్రాంగదుడు:

మన మిట నెందుల కుంటిమి
మగువా పద పోదము మఱి
మన సీమకు నిది యెచ్చట!

త్రైలోక్యసుందరి:

మన సీమకు మన మేగిన
మనల నమ్మెదరా నమ్మరొ
ఒక పామై పుట్టితి వకట కటా నన్ను నిచ్చి
పెండ్లి చేసినారు కత్తికి బాసికము కట్టి
నిను నానాతీర్థమ్ముల మునిగించితి నిచట నీవు
మానిసిరూపము పొందితి మహీపాల సంతానమ

చిత్రాంగదుడు:

(కీర్తన)

ఎంత శ్రమం పడితివే
ఇంతి నన్నె మనసిగా

సంతరించుకొనగ నాడు
జన్మ సఫల మయ్యెనే ॥ఎంత శ్రమంపడితివే॥
ఈవు నా బ్రతుకు ఫలము
వీవు నా శిరోమణివె
ఈవ నా యిహము పరము
నీవ నా కోర్కె మూర్తి ॥ఎంత శ్రమంపడితివే॥
నీ ఫాలమున ముద్దిడెదను
నీ చెక్కిలి చే నొక్కెద
అలసిన నీ పాదమ్ములు
ఒలనా నత్తెన చేతుల ॥ఎంత శ్రమంపడితివే॥

త్రైలోక్యసుందరి:

ఇది పరదేశము స్వామీ ఎవరైనను చూచిపోదు
రింటికి చేరిన యాపై నీ మాటల నాడవచ్చు

చిత్రాంగదుడు:

మనలను నమ్మరంటివి మన మేటికి పోవలె నట
వనములలో కొండలలో మనసిజసుఖముల గాంతము

త్రైలోక్య సుందరి:

తనరార ధర్మ నిధానమ్ము మీ తండ్రి
తనరార ధర్మ నిధానమ్ము మీ తల్లి
కానక కన్న సంతానంబు నీవు
అందులో పామువై యవతరించితివి
నేను పెండ్లి చేయుదు మానిసి నంచు
ఏను వచ్చెద నంచు నెదురు చూచెదరు
ఇంటికి పోవలె నెల్ల రాజ్యంబు
దంటవై పాలింప తగుగదా సుఖము.

చిత్రాంగదుడు:

మనలను వారలు నమ్మవందువును
మగువా! యింటికి పోద మందువును
మనలను నమ్మెడు మార్గ మున్న నే
చనుదెంతును నిశ్చయముగ నింటికి

త్రైలోక్య సుందరి:

నీ వొక గంధర్వుండవు
నిన్ను శపించెను శృంగియను ఋషి

డాసకి పామై భారుణి పుట్టితి
ని నెలతను నే సను బ్రతికింపగ

చి త్రాంగ దు డు:

(కీ ర్త న)

ఋషి న న్నెందుకు శపించె నే?
హృషీకేశ్వరీ
ఋషు లన్నను నా కెంతో భవ గౌరవ
మన లెందుకు కోపము వచ్చినదో ॥ఋషిన న్నెందుకు॥
ఆ ఋషి యిప్పుడు కనపించినచో
చే షమింపు మటంచును నడిగెద ॥ఋషినన్నెందుకు॥

ఋ షి:

(ప్ర వే శిం చి)

త్రైలోక్యసుందరి తరుణీమణీ!
మేల్ మేల్ భ ర్తను మానిసి చేసితివి
అచ్చరల్ నీ కీ ర్తి నాలపించెదరు

చిత్రాంగదుడు:

మహాఋషీ! నమస్కారము
అహో ఋషీ! నా తప్పేమిటి?
అహా! మరి తప్పే యుండిన
మహాత్ములును బిడ్డల క్షమియింపరే

ఋషి:

ఓయి చిత్రాంగదా! ఓయి గంధర్వా!
నీ యతిలోక సంగీతపాండితి చేత
నన్ను గెల్చితి వయ్యా మున్ను స్వర్గమున
కన్ను కానక నన్నగౌరవించితివి
చెలగి నీ యొలనాగ శీలమ్ము చేత
చెలగు నీ వినయమ్ము చేత నిప్పుడును
నేను సంతోష మందితి నోయి గంధర్వా!
నీ వింటి కేగుము నీ తల్లి దండ్రు
లీ నీ లతాంగి పాతివ్రత్య మహిమచే
నిన్ను నమ్మెద రయ్యా నిశితగాన రహస్య
వారాశీ! ధాత్రికి రాజవై వెయ్యేండ్లు
పాలించెదవు నీవు భార్యయు నీవును
సుఖము నందెదరును సుతుల గాంచెదరు
తరువాత మీరు గంధర్వులై మరల
కడువడి స్వర్గలోకమ్ము చేరెదరు.

( పాముపాట — అయిపోయింది )

# చిన్ని మబ్బులు

కన్నె కాటుకకళ్ళు
చిన్న నాథుని చూచి
కదలు లాడిన వేళ
కందళించిన వేళ
ఆకాశమధ్యాన అట నొక్క తెలిమబ్బు
మెరుపులా మెరిసిందిలే
వెలుగుతో వొరిసిందిలే.

తొలి చిన్నచూలాలు
కొలసిగ్గు ప్రేమతో
విభుని చూచిన వేళ
విన్నబోయిన వేళ
బలపుమిన్నులలోన ఒక నీలి తెరమబ్బు
సంజలో తారిందిలే.
జాలుగా మూరిందలే.

తొలికాన్పు పసిపాప
సాకనేరని బాల
తెలవోయి పతిఁజూచి
కళవళించిన వేళ
తూరుపుకోనలో తొంగలించినమబ్బు
తెగపరుగులెత్తిందిలే
సొగసుల్లు పోయిందిలే.

రచన : 1926

2

# చిన్ని తలపు

ముదురాకు రాలేటి ముదిమినాళులలోన
తొడిగేటి చిగురాకు పసుచుపొద్దులలోన
ఆకునైనా కానుగా

అయినచో

సోకేది చిఱుగాలి నన్ను
మెల్ల, తాకేది మిణుగురుల పొన్న.

మొగిలుకన్నెల గుంపు దగదగని మెరిసేటి
చిగురువన్నెల కాంతిసొగసు సంజలలోన
మొగిలునైనా కానుగా

అయినచో

ఎగిరి యుందును వింటికొనల
మెల్ల, తగిలి యుందును వెల్గుసొనల.

తొలిప్రేమ రుచి చూచు నెలప్రాయపుంగన్నె
తలిరుమెత్తని బేల వలపులో తలపులో
ఊహనైనా కానుగా

అయినచో

వలచేది నను చిన్నచూపు
మెల్ల, కలచేది చిన్నదానితూపు.

రచన : 1926

## ఉషస్సు - సంధ్య

ప్రాగ్దిక్కన్యకయ చిట్టిబొట్టు పెట్టెను బాల
మాయ మర్మములేని మంచు చల్లని చూపు
కొసలం దుషఃకన్య కోర చూచింది
పసలం దుషఃకన్య పారువోయింది.

కొడుకు కోడండ్ర మ్రొక్కులు గ్రహించెడి చాన
మాతృమూర్తిక శాంతమధువు లూరెడి కంటి
కొసల సంధ్యాదేవి కోరగించింది
పసల సంధ్యాదేవి భక్తి మోచింది.

రచన : 1926

## బానిస సముద్రము

బానిసగూడెము పజ్జను
పయోరాశి యెందులకో?
పయోరాశి వీచివాత్య
పరువు లిడుట యెందులకో?

## 4

బానిసతన మొకడు వదలి
బహుచర్చా విషయుంబులు
కవనము, దేవుడు, సంఘము
జగత్తు నడిచెడు వ్యవహారంబులు.

సాయంవాహ్యాళి యిట్లు
చర్చాలుబ్ధులకును బానిసలకు
రివ్వు మంచు జలధివాత్య
కవ్వించెను వాడివోలె.

అతడు సైనిక ప్రతినిధి
ఎదురులేని హిరణ్యాక్షుడు
నదురులేని కంసరాజు
బెదురులేని దశకంఠుడు

భార్యతోడ వాహ్యాళికి
వచ్చెను పయోరాశివాత్యకు
విచలత్సికతామయ ధూమ్యాకు
ప్రతినిధి సతిపై ప్రణయము.

5

ఒక్క వెఱ్ఱిగాలి వీచి
చిక్క పట్టుకొనియుక
పెళ పెళ నాయము చీరయు
నెగిరెను తెరచాపవోలె.

శానిసతనమును గూడ పటా
పటా బ్రద్దలు చేసెడి
ప్రకృతిసిద్ధమైన వాంఛ
పరిమళించె వారి కనుల

అంతట ప్రతినిధి కన్నుల
అగ్గిలేదు బుగ్గిలేదు
ప్రక్కన వ్రేలాడు కత్తి
పరపర గొంతులు కోసెను.

పాతిక ముప్పది శవముల
ప్రవహించిన నెత్తురుతో
బుద్ధి వచ్చినట్లు గాలి
సద్దు మణగి యూరకుండె.

గంట గడిచె మఱల నల్లె
గాలి ఝురాగతి వీచెను
కవనము దేవుడు సంఘము జ
గత్తు చర్యాసంగతి సాగెను.

బానిసగూడెము పజ్జను
పయోరాశి యిందులకా?
పయోరాశి వీచివాత్య
పరువు లిడుట యిందులకా?

## ఉయ్యాల త్రాళ్ళు

ఇవి యేమి మోపులే
ఇవి యేమి మోపులే
బండ్లపై నెచ్చుటికి బంపింతురే
ఎడ్ల మెడలను గంట
ఎడ్ల కనులను గంత
లెచ్చుటికి తోలుకొని యేగింతురే

అమ్మా, నీ గోల నీ
దశిగినది చెప్పవే
ఎచ్చటికి దోలుకొని యేగింతురే
బండ్లపై నెచ్చటికి బంపింతురే.

మన కెందుకా మాట
మన కెందుకా జోలి
బండ్లపై నెచ్చటికి బంపింతురో

ఊరుకోరా తండ్రి
ఊరుకోరా బాబు
ఎచ్చటికి దోలుకొని యేగింతురో

ఎవరైన వినిపోదు
రెవరైన వినిపోదు
నెచ్చటికి దోలుకొని యేగింతురో
బండ్లపై నెచ్చటికి బంపింతురో. .

ఎవరైన విన్నచో
ఎవరైన కన్నచో
కొంపమీదికి వచ్చి కూర్చుండునా

8

అని యేమి మోపు లని
అని యేటకు బోవు నని
అడిగినంతనకూడ నపరాధమా

పెదవి కదిపిన తప్పా
యెదియు నడిగిన తప్పా
కొంపమీదికి వచ్చి కూర్చుండునా
అడిగినంతనకూడ నపరాధమా.

ఉయ్యాల త్రాళ్ళోయి
ఉయ్యాల త్రాళ్ళోయి
కొంపమీదికి వచ్చి కూర్చుండునోయ్
త్రాళ్ళు కట్టలు కట్టి
తరలించుచున్నారు
అడుగు టద్దియుగూడ నపరాధమోయ్

అమ్మనా రుత్సవము
లాపివేశా రోయ్
కొంపమీదికి వచ్చి కూర్చుండునోయ్
అడుగు టద్దియుకూడ నపరాధమోయ్.

అమ్మవా రుత్సవము
లాపివేయుట యేల
అమ్మ మాన్యపు పంట లయిపోయెనా!
ఎడ్ల మెడలను గంట
లేల కట్టిరి తల్లి
ప్రోత దిక్కులయందు ప్రోగించరా!

ఎడ్ల కన్నుల గంత
లేల కట్టిరి కల్లి
అమ్మ మాన్యపు పంట లయిపోయెనా
ప్రోత దిక్కులయందు ప్రోగించరా.

ఎచటి మాన్యపు పంట
లచటనే తిని వేసి
రమ్మ మాన్యపు పంట లయిపోయెనోయ్

ఎడ్ల గంటల ప్రోత
లేమొ పండినయట్లు
ప్రోత దిక్కులయందు ప్రోగింతురోయ్

ఎడ్ల గంతలు కట్టి
యింత తిననీయరోయ్

అమ్మ మాన్యపుపంట లయిపోయెనోయ్
ప్రోత దిక్కులయందు ప్రోగింతురోయ్.

పూజారులునుగూడ
పోవుచున్నారమ్మ
సరి దొంగతన మంత సాగింతురా

వెట్టి నాయకు లల్లె
వెంట నేగెద రమ్మ
అంత నిర్భయముగా నాడింతురా

అమ్మవా రుత్సవము
లాపియే వేసినా
సరి దొంగతన మింత సాగింతురా
అంత నిర్భయముగా నాడింతురా.

అది యొక్క యెత్తోయి
అది యొక్క యొడుపోయి
సరి దొంగతన మల్లె సాగింతురోయ్.

అందఱును కట్టుకొని
ఆటలాడెద రోయ్
అంత నిర్భయముగా నాడింతురోయ్

అమ్మవా రుత్సవము
లవి జరుగు చున్నట్లై
సరి దొంగతన మట్లై సాగింతురోయ్
అంత సర్భయముగా నాడింతురోయ్.

ఎడ్ల నాపెదనమ్మ
ఎడ్ల తోలెదనమ్మ
ఎవ రడ్డమయి వత్తురో చూతునే

ఎడ్ల గంటలు విప్పి
ఎడ్ల పొలముల తోలి
ఎల్లరను నదలింపగా పోదునే

అమ్మవా రుత్సవము
లవి మరల జరిగింతు
ఎవ రడ్డమయి వత్తురో చూతునే
ఎల్లరను నదలింపగా పోదునే.

ద్రాళ్ళ నడుమ తుపాకి
దాచినా రో తండ్రి
అడ్డ మేగిన కాల్తురో నాయనా

తాళ్ళ నడుమను మందు
దాచినా రో బాబు
అది యింతలో పేల్తురో నాయనా

ప్రాజాకులను త్రావ
బోసినా రో తండ్రి
అడ్డ మేగిన గాల్పు రో నాయనా
అవి యింతలోఁ దేల్పు రో నాయనా.

నేను చచ్చిన నేఁడు
నీ కడుపు చల్లగా
ఉన్న నెప్పటికైన నోడ్డక్కదా?

ఒకరి తరువాతగా
నొక్కరము మే మెల్ల
అడ్డుపెట్టుచు బండి యాగింతుమే.

ఇపుడు కాకుంటేను
ఏనాటి కైననూ
అమ్మవా రుత్సవము లాడింతుమే
యుదరి ఉయ్యాల త్రాళ్ళూగింతుమే.

రచన : 1938 ఆగస్టు

కాఁడు. నారదుని శిష్యుఁడైన మణికంధరుఁడు. ఆతనికడ మా సౌందర్య ప్రదర్శనములు, మా టక్కుటమారములు నేమాత్రము పనికిరావు. నేను నా కున్న సౌందర్యముచే వానిని మోహింపఁ జేయఁగలను నమ్మక మిసుమంతయు లేక యున్నది. వాని మాట విన్నంతనే శరీరము గజగజ వణఁకు చున్నది. దేవా! యీ కార్యమునకు నన్ను వదలి మఱి యొక యచ్చర లేమను నియోగింపఁ బ్రార్థించుచున్నదాన" నని వేఁడుకొనెను.

ఆమె పల్కుల కింద్రుఁడు వెఱగంది "రంభా! ఈ రీతి పేలవైై కాదని యెప్పుడును బల్కినదానవు గావు. ఈ నాఁ డెందులకో భయపడుచున్నావు. ఇట్టి కార్యములను నెఱవేర్చుటలో సమర్థులు మా కొలువునందు నీకంటె నితరు లెవరు కలరు? ఎప్పుడును విని యెఱుంగని పిఱికిమాటలు పల్కుచుంటివేమి? ఎట్టి యింద్రియ నిగ్రహము కలవారినైన మోహింపఁ జేయుటలో నీ సౌందర మే చాలియుండునది. నీవే యిటుల పల్కుచున్న మఱి యంగీకరించువా రెవరు? ఆతని వలపించుటకు నీ సౌందర్యము చాలదేని నింతకంటె నధిక సౌందర్యము కల్గునట్లు వర మొసంగెద. కాదనక శీఘ్రముగా వెడలి యాతని మనోనిగ్రహమును జెఱచి, నీ సౌందర్యమునకు దాసునిగాఁ జేసికొని యీ కార్యము గట్టెక్కింపుము" అని యానతిచ్చి సౌందర్యము వృద్ధియగు నట్టి వరమును బ్రసాదించి పంపెను. ఆమెయు మాఱు మాటాడఁజాలక అట్లేయని తన గృహమునకు వెడలెను.

ఇంద్రుని వరప్రసాదమువలన నధిక సౌందర్యవతియై యద్దమునఁ దనరూపముఁ జూచి మురుసుకొనుచు నీ రూప సంపదతో నాతని తపమునకు భంగము కలిగింపఁజాలుదుమని నిశ్చయించుకొని చెలికత్తియలతోఁగూడఁ బయనమైయాతని యాశ్రమమును బ్రవేశించి మెల్ల మెల్లగా మణికంధరునిసమీపించిచూడ నా మహనీయుఁడు గాఢతపములో నిమగ్నుఁడై యుండెను. పాప మా రంభ మణికంధరుని నిశ్చల తపమునుగాంచి భీతిఁజెంది యింద్రుని కార్య మెట్లు నెఱవేర్తునాయని కొంతతడవాలోచించి తుదకు ధైర్యమూని చెలికత్తియలతోఁగూడి పాటలుపాడుచు నాటలాడుచు నచటనే విహరింప నారంభించెను.

కొంతకాలమునకు మణికంధరుఁడు సమాధిని జాలించి కన్నులు తెఱచి చూచునప్పటికి కెట్టయెదుట సౌందర్యరాశియైన రంభ కనుపించెను. ఆ తళుకుబెళుకులు చూచునప్పటికి కాతని మనస్సు చంచలమై యామె నే ఱెప్పవాల్పక చూడఁ దొడంగెను. ఆతని మనోవికారమును గనుగొనిన రంభ యింద్రునికార్యము నెఱవేఱినట్లే భావించి ముసిముసినవ్వులు నవ్వుచు, నావలికేగి మధురరస మొలుకునట్లు గానము చేయుచుఁ గనులకు విందు చేకూర్చు నాట్యము సల్పుచుఁ దిరుగుచుండెను.

మణికంధరుఁ డామె సౌందర్యమునకు ముగ్ధుఁడై యామె పొందుకంటె వేఱు మోక్షము లేదనియు, నీమెయే తన తపఃఫలమనియు నెంచి యా ప్రదేశమునుండి లేచి

రంభ విహరించు ప్రదేశమునకు వెడలి "సుందరీ! నీ వెవతెవు? ఎచటినుండి యిచ్చటికే తెంచితివి? ఈ వనమున విహరించుటకుఁ గారణమేమి? ఈ వృత్తాంతమంతయు విని పించి నను ధన్యుం జేయు"మని వేఁడుకొనెను. అంతట నామె "మోహనాకారా! నేను దేవదాసిని. ఇంద్రు నాటపాటలచేఁ దృప్తిఁ బొందించుచుండుదానను. రంభ యనుపేరుగల దానను. మీ సౌందర్యముఁగాంచి చొక్కి మీతోఁగూడి సంతోషము లనుభవింపఁ దలఁచి వచ్చియున్నదాన" అని చెప్పెను. ఆమె సమాధానమునకు మిగుల సంతసించినవాఁడై యిట్టి సుందరి తనను వరించి వచ్చుట తన జన్మను సార్థకము చేయుటకే యని యెంచి సందియ మిసుమంతేనియు లేక యామె కరమునుబట్టి నంకించెను. ఆమెయుఁ జేతికిఁ జిక్కినట్లే నటించుచు మెల్ల మెల్లగా నచటికి సమీపమున నున్న పొదరింటఁ బ్రవేశించెను.

మణికంధరుఁ డామెను విడచి క్షణకాలమైనఁ గడపఁ జాలక యా పొదరింటిలోనికే తానును బ్రవేశించెను. ఆమె మణికంధరుని గాంచి "ఇంద్రుఁడు ప్రసాదించిన సౌందర్యముచే నీతని ననాయాసముగ వశపఱచుకొంటిని. ఇఁక నీతనిని సరససంభాషణములతో సంతృప్తిపఱచి యెట్లో తప్పించుకొని వెళ్లుదు" నని తలఁచి "ఆర్యా! తపస్సంపన్నులగు తా మీపొదరింటఁ బ్రవేశింపనేల? వసత యొంటరిగానుండఁదమ బోంట్లిట్లు రాఁదగునా" యని వచించెను. "సుందరీ! నీ యందమున కానంద మొంది నీపొందుఁగోరి యేతెంచిన న

న్నీ రీతిఁ బల్కుట న్యాయమా?'' యనుచు నామెను సమీపించెను. ఆమె దూరదూరముగా వెడలుచు ''మహానుభావా! మీ రీ రీతి తపోభంగముఁ గావించుకొనుట పాడిగాదు. మీరు మీ ప్రదేశమునకు వెడలి మీ యిష్టదైవమును గూర్చి నిశ్చలమైన మనస్సుతోఁ దపము చేయుఁడు'' అనుచు మందలించెను. ఆ మాటల కాతఁ డులికిపడి ''సుందరాంగీ! నా యిష్టదైవమువు నీవనియే భావించి నీయందే నా మనస్సు నిశ్చలము చేసితిని. ఇఁక నీవు ప్రసన్నురాలవై నా వాంఛిత మీడేర్చుటయే మిగిలియున్న'' దనుచు సమాధాన మిడెను. ఆమె సంతసించినట్లునటించుచు ''అందకాఁడా! దైవము మనో నిశ్చలతను బరిశీలించిన పిదపఁగదా ప్రసన్నమగుట. అందు లకుఁ గొంత కాలము వేచియుండుట యవసరముకదా? మన సుంచిన దైవముకాక మరెవరు ప్రత్యక్షమగును'' అనుచు మధురోక్తులతోఁ గాలము గడపుచుండెను. అతఁడును నామె పొందు నపేక్షించి కాలమున కెదురు చూచుచుండెను.

ఇట్లు రెండు మూఁడుదినములు గడచినపిదప రంభ నిక్కువముగ నాతని తపోభంగమయ్యెనని నిశ్చయించుకొని నలకూబరునియందు మక్కువ కలదియై యాతనినే మనమున ధ్యానించుచు నాతనియందుఁ దనకుఁగల ప్రేమను మాటలతో వెలిబుచ్చుచు మణికంధరునియం దయిష్టమును సూచింప నారంభించెను.

అపుడు మణికంధరుఁ డామె తనయందుఁ గృత్రిమ ప్రేమను జూపుచు నలకూబరునియందు గాఢానురాగము

కల్గియుండుటకు వగచి "అయ్యో! యీమె మోసకత్తెయని తెలిసికొనఁజాలక సంకువంటి తపమును భంగ మొనర్చుకొంటిఁగదా? ఇఁక నేమి చేయువాఁడ ? మఱలఁ దపము సల్పుటకు వెడలుదమా యన్న నది చేతకాని పనియైనది. ఈమెను వశపఱచుకొనుటయా యంతకంటె నసంభవము. ఆహా! ఇత కాలము తపము సల్పియు నా పరాత్పరునకు దూరస్థుఁడ నైతికదా! ఇఁక నేమి చేయువాఁడ? తుదకు దైవము నన్ను వంచించెనుగాదె! మాటలను బట్టిచూడ నామెకు నలకూబరునియందే ప్రేమ యధికమై యున్నట్లు అర్థమగుచున్నది. కనుక నిటనుండి వెడలిపోవుటయే యుచితము" అని తలంచి యామెతో మాఱుమాటాడక కొంతదూర మేగి బాగుగఁ జింతించి యొక యుపాయ మాలోచించి మోసమునకుఁ బ్రతిమోసమే శరణ్యమని నిశ్చయించుకొని చెట్లతో దట్టమైన ప్రదేశమునకు నెళ్ళి నఁకూబరుని వేషమును ధరించి యా రంభను మోసగింప సిద్ధముగా నుండెను.

౪

ద్వారకానగరమునఁ గాపుర ముండు కలభాషిణి యను వేశ్యకాంత యలనాఁడు నలకూబరుని గాంచినప్పటి నుండి యాతనియందే యధికానురాగము కలదియై నలకూబరునిఁ బొందుటకు మార్గమును వెదకుచుండెను. ఆమె యట్టి విచారముతోనుండ నొక సిద్ధుఁడు మృగేంద్రవాహన యను దేవికొక గానకళావిశారదను బలియీయ సంకల్పించు

కొని దేశము లన్నియు దిరిగి తిరిగి ద్వారకానగరమునకు వచ్చి కలభాషిణి గృహముం బ్రవేశించెను. ఆమెయు నా సిద్ధుని సత్కరించి లోనికిఁగొంపోయి యుచితాసనముపైఁ గూర్చుండఁజేసి "మహానుభావా! మీరు లోకములన్నియు సంచరించుచుండు మహాయోగులుగదా? లోకములో దాము చూచిన విశేషములం దెల్పి నన్ను ధన్యురాలింజేయుఁ"డని ప్రార్థించెను.

సిద్ధు:—బిడ్డా! లోకవృత్తాంతములఁ జెప్పుటకు మాకు లోకసంచారముతోఁ బనిలేదు. మేము సిద్ధుఁడ మగుటచే యోగదృష్టిచే సర్వము నెఱింగి లోకమున జరుగు వృత్తాంతములను, ఆగతానాగతములను జెప్పఁజాలుదుము.

కల:—స్వామీ! అట్లయిన నా మనమునఁ గల తలంపెద్దియో తెల్పుఁడు, చూతము.

సిద్ధు:—ఈ ప్రశ్నవలన నా శక్తి సామర్థ్యముల నరయఁదలంచితివి కాఁబోలు.

కల:—దేవా! అట్టి కోరిక నాకు లేదు. మీ శక్తి సామర్థ్యములను బరిశీలింప నేనెంతటిదానను? అది గాదు. నా యభిమతము సాధించుటకే యిట్లడిగితిని.

సిద్ధు:—బిడ్డా! నీవట్టి యుద్దేశ్యమే కలిగియున్నఁ జెప్పెద నాలింపుము. నీ మనమున నలకూబరునిపై వలపు దప్ప మఱేమియు లేదు.

కల:—స్వామీ! యథార్థమే వచించితిరి. మానవ మాత్రురాలనగు నాకు నలకూబరునితోఁ బొందిక యెట్లు

సమకూరఁగలదో తోఁపకున్నది. అదియుఁ దమ యను గ్రహామువలననే నెఱవేఱవలసియున్నది.

సిద్ధు:—అంమలకు భయపడకుము. అనతికాలముననే నీకోరిక యీడేరఁగలదు. దానికేమిగాని, సంగీతవిద్యయందు నీ వసమాన ప్రజ్ఞకలదానవు కదా! మణికంధరుఁడు పద్మనాభక్షేత్రమున నున్నపుడు మాత్రమే గానామృతమును గ్రోలియుంటిని. అతఁడు తపస్సునకు వెడలినపిదప మఱల వినుట సంభవించ లేదు. ఏదీ, కొలదికాలము వీణాగానము చేసి నా కానందము చేకూర్పుము.

కల:—అయ్యా! మణికంధరుని సంగతి చెప్పితిరి. ఆతని వృత్తాంతమెద్దియో వినిపించుఁడు.

సిద్ధు:—ఆతఁడు నారదుని యుపదేశానుసారము దివ్యక్షేత్రములను దర్శించి తుదకుఁ బద్మనాభక్షేత్రమును జేరి పద్మనాభస్వామి నర్చించుచుఁ గొంతకాలముండెను. తన కెంతకాలమునకును భగవంతుఁడు ప్రత్యక్షము కాకపోఁగాఁ దపస్సుచేసికొనుటకై యీ సమీపారణ్యమునకు వెడలెను. కలభాషిణీ! మేము వచ్చి చాలకాలమైనది. సిద్ధులమగు మే మొక చోటనుండుట ధర్మము కాదు. ఇఁక వెళ్ళి వత్తుము.

కల:—మహానుభావా! ఈ దీనురాలిని విపత్సముద్రముఁ బడద్రోసి వెడలుట తగవు కాదు. నాయందుఁ గనికరముంచి నాకోర్కె యీడేర్ప వేఁడుచున్నదాన.

సిద్ధు:—నీ యిష్టమెద్దియో స్పష్టముగాఁ దెల్పిన నది తప్పక చేయుదును.

కల:—గురువర్యా! తమ రెట్లులైన నన్నా నలకూబరునిం జేర్చి ధన్యురాలిం జేయఁ బ్రార్థించుచున్న దాన.

సిద్ధు:—ఆ నలకూబరుఁడును పద్మనాభక్షేత్రమునకు సమీపముననున్న యరణ్యముననే యున్నట్లు నా యోగ దృష్టికి గోచరమగుచున్నది. కాని నిన్నచటికిఁ గొనిపోవు టెట్లాయని విచారించుచున్నాఁడ. నేనెల్లపుడును సింహ వాహనముమీఁదఁ బ్రయాణము చేయుచుందును. దాని మీఁదనే నిన్నును దీసికొనిపోవుదమన్న లోకులునన్ను నిందింతురు. ఇంతకన్న నిన్ను దీసికొనివెళ్లుటకు వేఱు సాధన మెద్దియుఁ గాన్పింపదు. కానిమ్ము, ఎవరేమనుకొనినను ననుకొననిమ్ము. నాతో వచ్చుట కంగీకరింతువేని యట్లే తీసికొనివెళ్ళుదును.

కల:—తమ రెట్లాజ్ఞాపించిన నా విధముగాఁ జేయ సిద్ధముగ నున్నదాన.

ఈరీతిఁ గలభాషిణి పలుక నాతఁడును నంగీకరించి తానెక్కిన సింహముమీఁదనే కూర్చుండఁబెట్టుకొని యాకాశ మార్గమున మహా వేగముతో ననేక పర్వతములను, పెక్కు పట్టణములను దాఁటివెళ్లుచుండెను. ఆ విధముగాఁ గొంత దూరము వెళ్ళునప్పటి కాసింగ మెంత ప్రయత్నించినను గదలక నిలచిపోయెను. సిద్ధుఁ డది కదలకుండుటకుఁ గారణ మూహించి దానిని మెల్లగా భూమిపైకి దించి మృగేంద్ర వాహనాలయము సమీపించి "అమ్మా! ఈ దేవి చాల ప్రభావముకలది. ఈమెకు మ్రొక్కిన నెట్టికోరికలైన నీడేరఁ

గలవు. కనుక మన మీదేవికి నమస్కరించి తర్వాత వెడలు దము" అని చెప్పి యా సింహాసనుండి దిగి దేవాలయముం బ్రవేశించి యామె నొక మంటపమునఁ గూర్చుండఁబెట్టి పూలు తెచ్చుటకై వెడలెను.

ఈ లోపల నొక ముదుసలివచ్చి "తల్లీ! ఈ దుర్మార్గునకు నీ వెట్లు చిక్కితివి? నిన్ను శక్తికి బలియిచ్చి తన కోర్కెలను సిద్ధిపఁజేసికొనుటకై తెచ్చినాఁడు. వాఁడు వచ్చులోపలనే తప్పించుకొనిపొమ్ము" అని చెప్పుచుండఁగనే యాతఁడు వచ్చి "బిడ్డా! చాల తడవైనది. త్వరగా నాలయములోనికి వెడలి దేవి నర్చించి వెడలుదమురమ్ము" అనునప్పటి కామె భీతిఁజెంది "అవ్వా! నావెంట నీవును ర"మ్మని యా ముదుసలిని బ్రార్థించెను. ఆ పల్కులను విని సిద్ధుఁడీదియంతయు నీ ముసలిదాని దుర్బోధయే యని యెంచి, ఇఁక జాగుచేసిన కార్యము చెడిపోవునని తలఁచి "ఓసీ! ఈ ముసలిదియా నిన్ను గాపాడునది! చూతములే" యని యువతి కొప్పుబట్టుకొని లాగుచుండఁగా నావృద్ధాంగన అడ్డముగ నిలచెను. అచటనే యామెను జంపనెంచి తన చేతియందలి కత్తితో నామె కంఠమును నఱుకఁబోగా నా ముసలిది తన కంఠ మడ్డు పెట్టెను. ఆ కత్తి దెబ్బచే ముసలిదాని కంఠము తెగి క్రిందపడెను. దేవి సాక్షాత్కరించి "ఓరి పాపీ! యిట్టి వృద్ధాంగన నటరా బలియిచ్చుట? ఛీ పొమ్ము" అనుచు నా సిద్ధుని దన్నెను. ఆ తన్నున కాతఁడు శిలభాషిణితోఁగూడ మణికంధరుఁడు రంభతోఁగూడియున్న యరణ్యమునం బడెను.

అతఁడు కొంతసేపటికిఁ దెప్పరిల్లి సుస్థితముగా నుండియు భయముచే దుఃఖపడుచున్న కలభాషిణిని బలాత్కరింప నామె యెలుఁగెత్తి "ఈ దుర్మార్గుఁడు నన్ను బలవంతముగాఁ బట్టఁ జూచుచున్నాఁడు. కాపాడుఁడు. కాపాడుఁడు" అని కేకలు వేసెను.

ఈ సమయముననే యట మణికంధరుఁడు నలకూబర వేషము వేసికొని రంభను మోసముచేయ సిద్ధపడి సమయమున కెదురుచూచుచుండెను. అప్పుడా యార్తనాదము విని, యాతఁడు మహాకోపముతో "ఓరీ! దుర్మార్గా! అబలను, ఒంటరిదానిని బట్టి బాధింపఁ జూచుచున్నావా! నిలునిలు" మనుచుఁ గత్తి చేతధరించి వెళ్లినప్పటి కాతఁడు పాఱిపోవ నారంభించెను. ఆమెయు సమీపముననున్న పొదలచాటున కేగి యావచ్చుచున్న వానిం గాంచి, యాతఁడు తాను ప్రేమించిన నలకూబరునిగఁ దెలిసికొని, అప్రయత్నముగాఁ దనకోర్కె యీడేర్చుకొను సమయ మేతెంచినదిగదా యని యువ్విళ్ళూరుచు నారదుఁడిచ్చిన వరప్రభావముతో రంభ వేషమును ధరించి, యెదురుగా వచ్చి యాతని ననేకవిధముల నుపలాలించెను. మాయ నలకూబరుఁడును నామెను రంభ యనియే భావించి తన కోర్కె యీడేరినది కదా యని సంతసించుచు మాయ రంభతోఁగూడ నొక పొదరింటిలోనికి వెడలి యామెతో సమస్త సుఖము లనుభవించుచుండెను.

వీరిట్లు సుఖించుచుండఁగా నిజమైన రంభవచ్చి "నాథా! అది రంభ కాదు. నా రూపమును ధరించి నిన్ను

వంచించుటకు వచ్చిన మోసకత్తె.'' అని గద్గదస్వరముతోఁ బల్కుచు గొన్ని రహస్యములను జెప్పెను. అతఁ డా రహస్యములనుబట్టి యీ వచ్చినదియే నిజమైన రంభయని నిర్ణయించుకొని యా మోసకత్తెను వెడల నడచెను. ఆమె వెడలిపోయినపిదప మాయ నలకూబరుఁడు నిజమైన రంభతోఁగూడి యందే జరిగిన మోసమునుగూర్చి చెప్పుకొనుచు సుఖించుచుండెను.

వీ రిట్లు సుఖముగఁ గాలము గడుపుచుండ నిజమైన నలకూబరుఁడు వచ్చి వారింగాంచి నివ్వెఱఁబోయి ''రంభా! నా యెదుటనే పరునిగూడియుంట నా కవమానము కాదా? అతఁడు నిజమైన నలకూబరుఁడుగాఁడు. ఎవఁడో మోసకాఁడు. నా రూపముతో వచ్చి నిన్ను వంచించియున్నాఁడు. ఇపుడైన వానిం ద్రోసిపుచ్చి యీవలకు రమ్ము'' అని పలుకఁగా రంభ యాశ్చర్యపడి వా రిరువురిలో నిజమైన నలకూబరుఁ డెవఁడో, మోసకాఁ డెవఁడో తెలిసికొనఁజాలక దూరముగా నిలచియుండెను. అంతట వా రిరువురును ఘోరముగాఁ బోర నారంభించిరి. ఎంతకాలము పోరాడినను నిరువు రొకరికొకరు తీసిపోకయుండిరి. అపు డామె వారింగాంచి ''శూరులారా! ఎంతకాల మీరీతిఁ బోరాడెదరు? మీ యిరువురి నొక రహస్యవిషయ మడిగెదను. అద్దానిం జెప్పినవాఁడు నిజమైన నలకూబరుఁడని భావించి వానిం జేపట్టుదును'' అని చెప్పెను. వా రిరువు రందుల కంగీకరించి, పోరాడుట మానిరి. అంత నా రంభ వా రిరువురిని దూర

దూరముగా నిల్చి యొకఁ్కనికడకు వెళ్ళి "మన కిరువురకుఁ గలపూర్వోక్తమైన ప్రసంగ మెచటఁ గలిగెనో చెప్పు" మని యడుగఁగా మొదటివాఁడు పూసఁగ్రుచ్చినట్లు చెప్పెనే కాని రెండవవాఁడు చెప్పఁజాలకపోయెను. రంభ రెండవవానిం గాంచి కోపముతోఁ గన్నులెఱ్ఱఁజేసి, పెదవు లదర "ఓరీ దుర్మార్గా! ఇట్టి మాయవేషముఁ దాల్చి నన్ను మోసము చేయవచ్చితివటరా! ఛీ! నీ ముఖము చూడరాదు. వెడలి పొమ్ము" అని పల్కుచు మొదటివానిం జేరి చెట్టపట్టి నిలచి యుండెను.

అప్పుడు నిజ నలకూబరుఁడు వానింగాంచి మహాగ్రహముతో "ఓరీ! పాపీ! యెంతటిమోసమున కొడిగట్టితివిరా! ఇట్టి నీ శరీరము ముక్కలు ముక్కలుచేసి కాకులకు వైచినను పాపము లేదు." అని నిందించుచు "అల్పాయుష్కుఁడవై భూలోకమున జన్మింతువుగాక" అని శపించి తన ప్రేయురాలితోఁగూడ వెళ్ళిపోయెను. అంత మణికంధరుఁడును నలకూబరరూపమును వదలి తన పర్ణశాలవైపునకు వెడలి యొకచోటఁ గూర్చుండి "ఔరా! తపమా, చెడిపోయె. రంభయా, దక్కదాయె. తుదకీ గంధర్వరూపమునుగూడ విడనాడి భూలోకమున జన్మించవలసివచ్చినదిగదా! నా జీవిత మెన్ని కష్టముల కాలవాలమైనవి!" ఇఁక నేమి చేయుదును! ఎవరిని శరణుజొత్తును!" అని విలపించుచు నా ప్రదేశమునుండి మనసొప్పక తిరిగి పద్మనాభక్షేత్రమునకు

వెడలి యా పద్మనాభస్వామినే ధ్యానించుచు గాలము పుచ్చుచుండెను.

ఆ స్వామిని సేవించుట కనేకమంది కవులును, పండితులును, గాయకులును, భక్తులును వచ్చుచుఁ బోవుచుందురు. మణికంధరుఁడా క్షేత్రముననుండి స్వామిని సేవించుచున్నపుడెందఱో మహాకవులువచ్చి వారివారి కవితాపాటవమును జూపుచు హృదయంగమముగ ధ్యానించుచుండుట విని తానును సత్కవిత్వమును సంపాదింపనెంచి యచటికి వచ్చిన కవిపుంగవుల నడుగఁగా వా రాతనిం గాంచి "భక్తాగ్రేసరా! నీకుఁ గవిత్వ మభ్యసించుటయం దభిరుచిగలదేని, ఇచటికి సమీపముననే కాళికాక్షేత్ర మొకటి గలదు. అందలి కాళికాలయములో నుత్తరదిశయందొక శిలాశాసనము కలదు. అద్దానిం జదివి దానిలోఁ జెప్పినరీతిగాఁ జేసితివేని ఆ తల్లి మెచ్చి సత్కవిత్వ మలవడఁజేయును" అని చెప్పి వెడలిరి.

మణికంధరుఁడును వారు చెప్పినవిధముగాఁ గాళికాలయమునకు వెడలి యందున్న శిలాశాసనములోఁ జెప్పిన విధముగా సర్వము నిర్వర్తింప నాతనికి సత్కవిత్వమబ్బెను. అట్టి కవిత్వమునుబడసి పద్మనాభక్షేత్రమునకువచ్చి స్వామి దర్శనముచేసికొని యచటకువచ్చిన పండితుల శుశ్రూషచేసి వారి యనుగ్రహమును సంపాదించి సర్వశాస్త్రముల నచిరకాలముననే యభ్యసించెను.

అంతటితో నాతఁడు తృప్తిఁజెందక ఆగమవేత్తలున్న ప్రదేశములకు వెడలి యాగమరహస్యములను దెలిసికొనెను. అటుపిదపఁ గాళికాదేవి యనుగ్రహామువలనఁ బడసిన కవిత్వము కాశ్మీర దేశములోని శారదాపీఠమునను్న పండితులకు వినిపించి వారిమెప్పు పడసినఁగాని సార్థకము కాదనియెంచి, పయనమై కొన్ని ప్రయాణములలో నాదేశమునకువెడలి శారదాపీఠపండితులలో నొకఁడు శిష్యులకుఁ బాఠములు చెప్పుచుండ నా మహానీయుని దర్శించి నమస్కరించి యటనే నిలచియుండెను. పండితోత్తముఁ డతని వినయసంపదకు మెచ్చి యాతని కులగోత్రాదులడిగి తెలిసికొని "శిష్యులారా! పూజ్యుఁడగు నీ మహానీయుఁడు వచ్చినందున నీ దినము పూర్వానధ్యయనముగ నెన్నఁబడు" నని పల్కి పాఠములు చెప్పుట మానెను.

ఆ సమయముననే యొక శిష్యుఁడు పుస్తకము నొకదానిని దెచ్చి గురువున కొసఁగెను. "ఓయీ! యింతయాలస్యమేల చేసితి" వని గురువుగా రాతనిని ప్రశ్నించిరి. అప్పు డాతఁడచ్చట జరిగిన విశేషముల నిట్లు చెప్పనారంభించెను:

"గురూత్తమా! మీరు నన్ను పుస్తకమునకై పంప దారిలో నెక్కడను మసలక శాలీనుని గృహమునకు వెడలి కనుగొనఁగా నా పండితుఁడు భార్యతోఁగూడ నుపవనమున నున్నట్లు తెలిసికొని యటనుండి బయలుదేరి యా తోటలోనికి వెడలితిని. ఆ సమయమున నా మహానీయుఁడు భార్య పాదము లొత్తుచుండఁగా నొక పూఁబోదరింటఁ బవ్వ

ళించి యుండెను. నేనచ్చటికి వెడలి శాలీనునకుఁ గన్పించు నప్పటి కాతఁడునవ్వి, "ఉపాధ్యాయులు పుస్తకమునకుఁ బంపి యుండిరా? అది యిచటనేయున్నది. క్షణకాలమాగుము. ఇచ్చిపంపెదను. అంతవఱకు నా మామిడిగున్న నీడయందుఁ గూర్చుండుము." అని చెప్పెను. అట్లే యా చెట్టునీడనఁ గూర్చుండియుంటిని.

అపుడు శాలీనుఁడు సుగాత్రింజూచి "కాంతా! అమృత మేమైనఁ ద్రాగితివా యేమి? నీకు లేఁబ్రాయమంతకంతకు వృద్ధియగుచున్నది. ఈ రీతి శరీరసౌందర్య మతిశయించుటకుఁ గారణమేమియో చెప్పు" మని యడిగెను. ఆమె సిగ్గుతోఁ దలవంచుకొని "నాకేమియుఁ దెలియ" దనిసమాధానమిడెను. "ప్రియా! నీకీ జవ్వన మతిశయించుటకు నేనే కారకుఁడను. అది నీకుఁ దెలియకున్నఁ జెప్పెదవినుము. నీకు నిత్యసౌందర్యము వర్ధిల్లుటకుఁగాను గర్భము కలుగకుండునట్లు దేవిని వరము వేఁడ నా తల్లియు నట్లేయగునని యభయమిచ్చెను. అందువలన నీకు సౌందర్యము వృద్ధిపొందుచున్న" దని నుడివెను. ఆమె యావృత్తాంతమును విని "నాథా! నేనును లోకమాతను బుత్రసంతానము కల్గునట్లు వరమిమ్మని యర్థించితిని. అందుల కాతల్లియు సమ్మతించినది కదా? ఇఁక నా జవ్వన మెట్లు కొఱవడకుండును?" అని యడిగెను. ఆమె మాటలు విన్నంతనే శాలీనుఁడు మండిపడుచు "నాయిష్టమునకు వ్యతిరేకముగ దేవిని వరమడిగి పడసియుంటివి. అది యెట్లు నెఱవేఱునో చూతముగాక." అనుచు లేచి వడివడిగా

వెడలి యాతోటలోని శతతాళఘ్నమను సరస్సులో దుమికెను. వెంటనే సుగాత్రియు వెడలి యేమియు దిక్కుతోచక పతిలేని బ్రతుకేలయని వాపోవుచు నామెయు నందేపడెను. ఆ పెనుమ్రోత విని గ్రామములోనివారు పెక్కండ్రు వచ్చి వారిని దీయుట కెంతయో ప్రయత్నించిరిగాని యెంత వెదకినను వారి యాచూకే కన్పింపకపోయెను. ఇంక చేయునదిలేక యెచ్చటివారచ్చట వెడలిపోయిరి.

నేనును వారి మరణమునకు విచారపడుచు నటనుండి లేచి శాలినుండున్న పొదరింటికేగి యుందాక మూలనున్న గ్రంథమును దీసికొనివచ్చియుంటిని. ఇదియే నా యాలస్యమునకుఁ గారణము.'' అని విన్నవించెను. ఆ వృత్తాంతమును వినినంతనే యట్టి యుత్తమదంపతుల కిట్టి దుర్గతిపట్టినదికదా యని గురువర్యుడును మిగుల విచారపడెను. అచ్చటనున్న శిష్యబృందముకూడఁ బరితపింప నారంభించిరి.

వారందఱీతీ విచారసాగరమున మునిఁగియుండుట చూచి మణికంధరుఁడు తన కవిత్వము ప్రదర్శించుట కిది యదనుకాదని యెంచి యటనుండుట కిష్టపడక యా గురువర్యునితో ''స్వామీ! తమ దర్శనమువలన ధన్యుఁడనైతిని. ఇంక వెళ్ళివత్తును. సెలవొసంగుఁ'' డనుచుఁ బ్రార్థించి వారి యనుమతింబడసి యటనుండి బయలుదేఱి తిరిగి పద్మనాభక్షేత్రమునకే వెడలి యేమఱక భగవత్సేవఁ జేయుచునుండెను. కాని యాతని మనస్సునందలి విచారముమాత్ర మధికము కాఁజొచ్చెను.

నానాఁటికి మానవజన్మ యెత్తవలసివచ్చెగదా యను చింత యధికమగుటచే నిఁక నా క్షేత్రమున నుండఁజాలక యటనుండి బయల్వెడలి మృగేంద్రవాహనాలయమున కేగెను. ఆ యాలయముననే కలభాషిణియు, సిద్ధుఁడును గాన్పించిరి. వారిని జూచునప్పటికి మణికంధరునకు సంతోష మధికమయ్యెను. అంత వా రొకరి వృత్తాంతము నొక రామూలాగ్రముగాఁ దెలిసికొని సంతోషపరవశులై యటనే నివసించుచుండిరి.

౨౩

మృగేంద్రవాహనాలయమున నా ముప్వురును దేవీ సేవతోఁ గాలము గడపుచుండ నొకనాఁడు కలభాషిణి యొంటరిగాఁ గూర్చుండి యిట్లాలోచింప నారంభించెను : "మృగేంద్రవాహన సిద్ధునకు ఖడ్గమొసంగుచు 'ఓయీ! దీనిచే మొదట నెవరి కంఠము తఱుగ యత్నింతువో యయ్యది తప్పక వాని కంఠమును నఱికివేయఁ తీఱును. దీని శక్తి యప్రతిహతము' అని చెప్పినట్లు వినియుంటినికదా! సిద్ధుఁ డా ఖడ్గమును నా మెడ తఱుగుటకే మొదటయత్నించి ముసలిదాని యడ్డంకివలన వ్యర్థప్రయత్నుఁడై నాఁడు. అట్లయ్యును నది యడ్డులేని శక్తికలదగుటచే నేనాటికైన నది యుత్తరించివేయ తీఱవలెను. కాలయాపనచేసినందున లాభములేదు. కనుక నాకంఠ ముత్తరింప సిద్ధునే వేఁడు కొందును." అనుచు సిద్ధుఁడును మణికంధరుఁడును నేదియో ముచ్చటించుకొనుచుండ వారికడకేగి సిద్ధునింగాంచి "మహాను

భావా! మీ ఖడ్గమున కేనాటికైన నాకంత మొరగాక తప్పదుకదా! మీ చేతులతోనే యీ కార్యము ముగించి నన్ను దరింపఁజేయ వేఁడుచున్నదాన. అట్లు చేసితిరేని మీ కోరికయు నీడేరఁగలదు'' అని ప్రార్థించెను.

అపుడా సిద్ధుఁడు ''సుదతీ! మొదట నీవొసఁగఁ దలచినపుడు ముసలిది అడ్డమువచ్చి లోకమాతపై నొట్టుపెట్టి నీ కంఠమును దునుమకుండఁ జేసినది. ఇపుడు నా మనస్సు మాఱుటచే నే నాపనిని జేయఁ జేతులాడకున్నవి. కనుక మణికంధరుఁడే యీ కార్యమును ముగించి రాజ్యలక్ష్మిని బడసి సుఖించునుగాక. ఈ ఖడ్గ మాతనికే యిత్తు'' నని చెప్పెను. మణికంధరుఁ డాతని మాటలను విని ''అయ్యా! కలహంబరునిశాప మనుభవింప సిద్ధముగానున్న నాకీ స్త్రీహత్యాపాతకముకూడ నేల? ఈ పనికి నే నొడఁబడఁజాలను'' అని నుడివెను. అపుడా సిద్ధుఁడు మణికంధరునిజూచి ''ఆర్యా! ఇయ్యది పాపహేతువుకాదు. ఈ కార్యమును జేయుటవలన నీకును కలభాషిణికిని మేలుకలుగఁగలదు. ఈ విషయములో సందేహమునొందకు.'' అని చెప్పుచుఁ దనచేతనున్న ఖడ్గము నాతని చేతికందీయ మణికంధరుఁడు సిద్ధుని యాదేశమును శిరసావహించి యా ఖడ్గమును గ్రహించి యుభయులకు మేలు చేకూర్చు కార్యమగుటచే నద్దానిం జేయ సంసిద్ధుఁడై నిలచియుండెను.

కలభాషిణియు ధైర్యమవలంబించి గంధమాల్యాదులను ధరించి దేవికి నమస్కరించి నిశ్చలహృదయముకలదియై

మోకరించి తలవంచి యుండెను. మణికంధరుఁడు మొదట ధైర్యమవలంబించియు సందేహముతోఁ గొంతతడ వాలోచించి తుదకుఁ గలభాషిణి కంఠమును ఖండించెను. వెంటనే యా మృగేంద్రవాహన ప్రత్యక్షమై "గంధర్వరాజా! నీ వేదియో సందియముతో నొకింత యాలస్యము చేసితివి గాన ఈ జన్మలోఁ గాక మఱుజన్మలో రాజ్యభోగముల ననుభవింతువు" అని పల్కి యంతర్ధానమాయెను.

మణికంధరుఁడు దేవిమహిమ కచ్చెరువొంది యా లోకమాతకుఁ బ్రదక్షిణ నమస్కారము లాచరించి యటనుండి బయల్వెడలి యొక చోటఁగూర్చుండి, నలకూబరుని శాపము దేవియనుగ్రహము నొకరూపముఁ దాల్చియున్నది కనుక వేఱొక జన్మ యెత్తక తప్పదు అని తలఁచి మఱల సిద్ధుని కడకు వెడలి తన మెడయందలి మణిమాలను సిద్ధునకొసఁగి, తన వీణను దేవ్యాలయముననే యుంచి యక్కడినుండి శ్రీశైల క్షేత్రమునకు వెడలి మల్లికార్జునస్వామి నారాధించుచుఁ గొంతకాలముండి యొకనాఁడు పర్వతశిఖరమునుండి పడి మరణించుటకు సిద్ధమై యుండెను.

స్వభావసిద్ధుఁడను రాజా పర్వతమందలి మల్లికార్జున స్వామిని సేవించి యందలి విశేషములు చూచుచు నా ప్రదేశమునకు వచ్చి శిఖరమునుండి పడి మరణించుటకు సిద్ధముగానున్న మణికంధరుని గాంచి "ఓయీ! నీ వెవ్వఁడవు? ఇట్టి సాహస మేల చేయసిద్ధపడితివి?" అని యడిగెను. మణికంధరుఁడు తలయెత్తి వానింగాంచి "మహానుభావా! నేనొక

నిర్భాగ్యుఁడను. నా సంగతి మీరడిగితిరిగాన చెప్పెద నాలింపుఁడు. హేమకూటమున జన్మించిన యొక గంధర్వ కుమారుఁడను. గురువైన నారదమహర్షి యాజ్ఞప్రకారము భూలోకముననే నివసించి దివ్యదేశము లన్నియుఁ దిరిగి, కొంతకాలము తపస్సుచేసి, రంభచేఁ దపోభంగము చేయఁబడి, తండ్రి వలకూబరునివలన శాపమును బొంది, ఆ శాపము ననుభవించుటకై యిప్పుడీ కొండశిఖరమునుండి పడి చచ్చుటకు సిద్ధముగ నున్నాఁడను" అని తన వృత్తాంతము నంతటిని చెప్పెను. వాని వృత్తాంతమును వినిన స్వభావ సిద్ధుఁడు "గంధర్వకుమారా! ఈ ప్రయత్నముఁ జాలించి నామాట వినుము. నీకుఁ దప్పక మేలుకలుగును. నీవు భూలోకమున జన్మించవలసినట్లు నీ మాటలవలనఁ దెలియు చున్నది. సామాన్యకుటుంబమున జన్మించి కష్టములు పడుట కంటె నొక రాజకుటుంబమున జన్మించి భోగము ననుభవించుచు సుఖముగానుండుట యుచితముగదా? కనుక నా యల్లుఁడైన మణిస్తంభునకును, కూఁతురైన సుముఖాసత్తికిని బుత్రుఁడవై పుట్టి మహాప్రభావవంతుఁడవై రాజ్యభోగముల ననుభవించుచు, శత్రువర్గమును జయించి సుఖముండుము" మనుచు వేఁడుకొనెను. మణికంధరుఁడు వాని ప్రార్థనమునువిని "మహాత్మా! మీప్రభావమువలన నేను రాజుగ జన్మించినను శత్రువులను జయించుట మాత్రము కడు దుర్లభమైన కార్యము. కనుక ఇందులకు నే నొల్ల"నని విన్నవించెను. "మణికంధరా! ఆ విచారము నీకేల? నీకు విజయమును చేకూర్చు నొక ధనుస్సును, నుత్తమ బాణములను, నొక

దివ్యమణిని నీ కొసంగెదను. వానివలన నీవు సమస్తరాజలోకమును జయించి సర్వసుఖము లనుభవించఁగల్గుదువు. నీవు జన్మించినవెంటనే యౌవనవంతుఁడవై యలరారఁగల్గుదువు. ఆ సమయమున వానిని నీ కొసంగెదను. నామాట కాదనక యంగీకరింపుము." అని చెప్ప మణికంధరుఁ డందుల కంగీకరించి యా ప్రయత్నమును విరమించినవాఁడై స్వభావ సిద్ధునకు నమస్కరించి వెడలిపోయెను.

మణికంధరుఁడు సిద్ధుని యాజ్ఞప్రకారము భూలోకమున నాదంపతులకు జనింపఁ గోరికకలవాఁడై యా పర్వతముమీఁదనే నివసించుచుండెను. ఈ శరీరము విడచిన గాని యాదంపతుల గర్భమున జనింప వీలుండదుగాన నెట్లు శరీరమును విడచుటయా యని కొంతతడ వాలోచించి తుదకుఁ గొండచరియనుండి పడుటకే నిశ్చయించుకొని యొకనాఁ డొరులకుఁ దెలియకుండ పర్వతశిఖరమెక్కి పడ సిద్ధముగానుండెను. ఇట్లుండ నెచ్చటనుండియో యొక పెద్ద మోఁతవినవచ్చెను. మణికంధరుఁ డా ధ్వనినివిని వెఱగంది నలుదిశలు పరికించుచుండ నొక యువతి పరుగిడుచువచ్చి యొకకత్తినిచ్చి "మహానుభావా! నా వెంటనంటివచ్చు దుష్ట రక్కసుని వధించి నన్నీ యాపదనుండి కాపాడవలసిన"దని చెప్పుచుండఁగనే యొకమూలనుండి బాణవర్షము కురియ నారంభించెను. "అమ్మా! యీబాణవర్షమేమి? ఈ కత్తితో నేమిచేయుమందువు? నీ వెవ్వరిదానవు?" అని మణికంధరుఁ డడుగ నామె గజగజ వణఁకుచు "అయ్యా! నేనభినవకౌముది

యను నచ్చరలేమను. మృగేంద్రవాహనను దర్శింప నాలయమునకు వెడలఁగా నట నొక క్రూరదానవుఁడు నన్ను బట్టుకొనుటకై వెన్నంటివచ్చుచున్నాఁడు. వాఁడే ఈ బాణ వర్షమును గురిపించుచుండెను. కనుక జాగుచేయక ఈ ఖడ్గ ముతో నా బాణవర్షము నాపి, యేదుపందిరూపమును ధరించి వచ్చుచున్న యా క్రూరరాక్షసుని సంహరించుము.'' అని ప్రార్థింప నామె నోదార్చి యా ఖడ్గముతో నా బాణ వర్షము నాపుటకు యత్నించుచుండగనే భయంకరరూప ముతో నా రక్కసుఁడు వచ్చుచుండెను. మణికంధరుఁడు వెంటనే వానిపై కత్తికి యా కత్తితోనే క్రూరదానవుని సంహరించెను. రక్కసుని జంపుతొందరలో బాణవర్షము నాపుటకు వీలుకానందున నందొక బాణము మణికంధరుని మర్మములు భేదింప వెంటనే యాతఁడును మరణించెను.

ఆ రీతి మరణించిన మణికంధరుఁడు స్వభావసిద్ధుని యాదేశానుసారము సుముఖాసత్తి గర్భమున జన్మించి సద్యోయౌవనుఁడై 'కళాపూర్ణుఁ'డను పేరుతో విరాజిల్లు చుండెను. సుముఖాసత్తి మణికంధరు లాబిడ్డ రూపసంపదను గాంచి యానందపరవశులై యుండిరి. ఆ సమయముననే స్వభావసిద్ధుఁడును వచ్చి తాను నుడివినరీతి బాణ, బాణాసన ములను, దివ్యమణిని నొసంగి వెడలిపోయెను. అంతటఁ గొలది దినముల కభినవకౌముదియు వచ్చి ఆతని సౌందర్యము గాంచి ముగ్ధురాలై ''మహారాజా! నే నభినవకౌముదియను నచ్చర కాంతను. తమ దర్శనమునకై వచ్చియున్నదాన'' ననుచు

వెనుక జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పి యటనే నిలచి యుండెను. అంతఁ గళాపూర్ణుఁ డామె సోయగమున కచ్చెరు వొంది యా లేమను గాంధర్వవిధితో వివాహమయ్యెను. అప్పటినుండియు నా యభినవకౌముది స్వర్గలోకమునకు వెడలక యిటనే నివసించి కళాపూర్ణునితో సమస్తసుఖముల ననుభవించుచుండెను.

౬

దేవాలయమున మణికంధరునిచేఁ దల నఱుకఁబడిన కలభాషిణి పూర్వజన్మమున సరస్వతీదేవి పెంచిన రామ చిలుక. ఒకనాఁడు సరస్వతీబ్రహ్మలు ఏకాంతమున నుండి రహస్యసంభాషణలు గావించుకొనుచుండిరి. ఆ చిలుకయు నా గృహముననే యుండుట కతన వారి సంభాషణములను విని, బ్రహ్మదేవుని సేవకై వచ్చిన రంభతోఁ జెప్పనారంభించెను. ఆ రీతిఁ జెప్పుచుండఁగా సరస్వతీదేవి విని కోపించి "ఓసీ! చిలుకా! నీవెట్టి రహస్యములనైన వెల్లడించుచుండుట యాగడమైనది. నాచేఁ బెంచఁబడిన నీవు నా రహస్యమునే వెల్లడించితివి గాన భూలోకమున వేశ్యకాంతవై జన్మించి యనేక కష్టముల నొందెదవు గాక" అని శపించెను. బ్రహ్మ యా ఘోరశాపమును విని జాలిఁజెంది "సరస్వతీ! నీకింతటి కోపమేల?" అని యడిగెను. "నాథా! యీ చిలుక దుండగములను గంటివా? మన మేకాంతమున ముచ్చటించుకొనిన రహస్యము నీ చిలుక రంభతోఁ జెప్పినది. ఇఁక కోపపడక యేమి చేయుమందు" వనుచు సరస్వతి సమాధానము చెప్పెను.

"అయ్యో! యీ జ్ఞానము లేని జంతువునా, జ్ఞానముగల నీవు శపించుట! ఔరా! యెంతటి భయంకర శాప మొసంగి యుంటివి? ఇట్టి క్రూర కార్యము తగునా?" యనుచు జిలుకపై జాలిగొని "శుకరాజమా! విూ యమ్మ యిచ్చిన శాపము కాదన నేరికిని వీలుకాదు. తర్వాతి జన్మలో మదాశయుఁడను రాజునకుఁ బుత్రికవై జనించి మధురలాలసయను పేరుతో వర్ధిల్లుచుఁ గళాపూర్ణునకు భార్యవై సమస్తభోగముల ననుభవించుచుఁ బరమపతివ్రతవై పోగడ్త కెక్కఁ గలవు" అని యోదార్చి వెడలిపోయెను.

ఆ సరస్వతీదేవి శాపమువలన నామచిలుక భూలోకమున ద్వారకానగరమందు వేశ్యాకుటుంబమున జన్మించి కలభాషిణియను పేరుతోఁ బెరిగి యామెయే మణికంధరుని చేఁదల నఱుకఁబడినపిదప బ్రహ్మదేవుఁడనుగ్రహించినవిధముగా మదాశయుఁ డను రాజునకు రూపానుభూతియందు జన్మించెను. ఆ దంపతు లా బిడ్డకు మధురలాలసయని పేరిడి యల్లారుముద్దుగఁ బెంచుచుండిరి. ఆ బాలిక దినదినాభివృద్ధి నొందుచు బాల్యమున గురూపదేశము లేకయే సమస్త శాస్త్రములను, గాంధర్వవిద్యను, కావ్యశిల్పమును నేర్చి యౌవనవతియయ్యెను.

మదాశయుఁడు పరాక్రమవంతుఁడై దేశములన్నియు జయించి కాసారపుర మేలుచున్న కళాపూర్ణునిమీఁదకుదాడి వెడలఁగా నాతఁడు మదాశయు నోడించెను. అప్పుడు మదాశయుఁడు ప్రార్థింపఁగా జాలిఁదలఁచి యాతని రాజ్య

మాతని కిచ్చెను. అప్పటినుండి మదాశయుఁడును, రూపాను భూతియుఁ దమరాజ్యమునకు వెడలక కళాపూర్ణునే సేవించు చుండిరి. ఇచ్చటనున్నపుడే వారికి మధురలాలస జన్మించినది. కళాపూర్ణుఁడు, తనకు స్వభావసిద్ధుఁ డిచ్చిన మణిని దారమునకుఁ గ్రుచ్చి బహుమానముగా నా బాలిక మెడయందు వేసెను. ఆ మణి సోకినంతనే యామెకుఁ బూర్వ జన్మస్మృతి కలిగి యన్నివిషయములు చెప్పుచుండెడిది. ఈ విధముగా నుండ మదాశయునకును, కళాపూర్ణునకును మనస్పర్థ లుప యింప నాతఁడు తన భార్యాబిడ్డలతోఁ దిరిగి క్రముక కంఠో త్తరపురమునకే వెడలి యందే నివసించుచుండెను.

మధురలాలస యౌవనవతి యైనప్పటినుండియుఁ గళాపూర్ణుని శౌర్యసాహసాదులు, రూపసౌందర్యాదులును వినియుండుటచే నాతనినే వివాహమాడనిశ్చయించి దినములు గడచినకొలది ప్రేమ యధికముకాఁగాఁ గృశింప నారంభించెను. తల్లిదండ్రు లామె నెంతగ నోదార్చినను ప్రయోజనము లేకయుండెను. బిడ్డమనోవిచార మేమియో తెలియఁ జాలక యామె చెలికత్తియలంబిల్చి మధురలాలసయొక్క దుఃఖకారణమెద్దియని ప్రశ్నించిరి. వారు కళాపూర్ణుని యందుఁగల మక్కువయే యామె కృశత్వమునకుఁ గారణమని చెప్పిరి. ఆ సంగతిని వారెఱిగి యీబిడ్డకోర్కెఁదీర్చుట యెట్లాయని తహతహపడ నారంభించిరి.

ఒకనాఁడు కళాపూర్ణుఁడు డేగలవేటకై యరణ్యమునకువెళ్ళి డేగలనుగొట్ట నారంభించెను. అందొక డేగ

బీతిఁజెంది మధురలాలసయున్న యుద్యానవనమునఁ బ్రవేశించెను. రాజును దానిని వెన్నంటి యా యుపవనమును జొచ్చి యెచట వెదకినను నాడేగ కన్పింపకపోయెను. దానిపై నిరాశఁజెంది తిరిగి వచ్చుచుండఁగా నొక పూఁబొదరింటి యందుఁ దామరతూళ్ల దారములతో నిర్మింపఁబడిన శయ్యయందుఁ బరుండి విరహవేదనపడుచున్న యొక సుందరాంగిని జూచి యామె సౌందర్యమున కచ్చెరువంది. తెప్పవాల్పక చూచుచుఁ గొంతవడి యటనే నిల్చెను. మధురలాలసయు నామనోహరాకారునిఁగాంచి యాతఁడే కళాపూర్ణుఁడుగ నిశ్చయించుకొని కనుల తనివిదీరఁ జూచుచుండెను. ఈ రీతి వారిరువురును బరస్పరాలోకనములచే నొండొరులను సత్కరించుకొని రేకాని వాక్కులచే సత్కరించుకొనఁజాలకపోయిరి. ఇంతలోఁ బరివారము తనను వెదకుచు వచ్చుచుండ రాజకిశోరము మీఁద మనసు మరల్చుకొని మెలమెల్లగ వెడలి తన పరివారముతోఁ గలిసి యా నాఁటికి వేటఁ జాలించి తన పురమునకు వెళ్లెను.

మధురలాలస రాజు వెడలుటఁ గాంచి యేమిచేయను దోఁపక నిట్టూర్పుల వెతఁగుందుచు "ఔరా! ఆ మనోహరుని దర్శించినపుడే యేలముచ్చటింపకపోతినా" యని వగచుచు మనోవేదనయధికముకాఁగా నంచేపొరలుచుండెను. చెలికత్తియలు వచ్చి యామెయవస్థఁగాంచి యెంతయో యోదార్పనొసఁగి ప్రసన్నురాలై తాను గాంచిన మనోహరు విషయ

మును వివరముగాఁ జెప్పెను. వారును కళాపూర్ణునితోఁటి సమాగమమున కుపాయము వెదకుచునుండిరి.

కళాపూర్ణుఁడు తన నగరమును బ్రవేశించినప్పటి నుండియు నెవరితో మాటలాడక, రాచకార్యములను విచారింపక నిద్రాహారములను వదలి చింతాక్రాంతుఁడై యుండెను. ఇట్లాదినమంతయు నెట్లోగడపి వేఁగినపెదపఁ గాలకృత్యములం దీర్చుకొని యేకాంతగృహముంజేరి తన ప్రియవయస్యుని బిలిపించుకొని యాతనితో నిట్లు ముచ్చటింప నారంభించెను.

కళా:—వేడుక చెలికాఁడా! మొన్న జేగల వేటకై వెళ్ళినప్పుడు క్రముకకంఠో త్తరపురమునకు సమీపముననున్న ప్రమదోద్యానవనమున నొక సుందరాంగిని జూచితిని.

చెలి:—మహారాజా! తమ కెప్పుడును సుందరాంగులు కన్పడుచునే యుందురు. నాకు మోదకములయం దిష్టమున్నట్లే నీకు సుందరాంగులయం దిష్టముండును. అందుకనియా యీరీతి విచారముతో నుండుట?

రాజు:—నీ యెగతాళిమాటల కేమికాని యామె సౌందర్యము వర్ణనాతీతము సుమా! ఆమె యందమున రతిదేవినిగూడ నతిశయించియున్నది. ఆపె యెవ్వరో తెలిసికొని వచ్చి నా సంతాపమును దీర్పుము.

చెలి:—స్త్రీలు కన్పడినంతనే రాజులకు విరహతాప మతిశయించుచుండును. ఇందుఁ గ్రొత్తయేమి?

రాజు:—చెలికాఁడా! స్త్రీలను జూచినంతమాత్ర మున నే నేను ప్రేమించువాఁడనేనా? ఆ యువతి రూపలావణ్యాదులం గాంచి ముగ్ధుఁడనైతిని. కాదనుకొనినను మనము వదలకున్నది. ఇట్టి విషయములను గనుగొనుటలో నీవతిసమర్థుఁడవు కదా? ఏదీ చూతము, నీ నైపుణ్యమంతటిని జూపి యీమె యెవ్వరో తెలిసికొని రమ్ము.

చెలి:—తెలిసికొనివచ్చుట కెచ్చటికి వెళ్ళవలెను? ఆమె నీ మనస్సులోనే యున్నది కదా? అడిగి తెలిసికొనక పోతివా?

రాజు:—ఎప్పుడును నిట్టిహేళనతో నే కాలముఁగడపి నన్ను బాధింపక వెంటనే యీ వృత్తాంత మారసిరమ్ము.

చెలి:—ప్రియవయస్యా! ఆ సుందరాంగి యెవరో నాకు బాగుగఁ దెలియును. చెప్పెద నాలింపుము. ఆ సుదతి సింగారాదరణమునకుఁ బాత్రుఁడై క్రముకకంఠోత్తరపురము నేలు మదాశయుఁడనురాజుకుమార్తె. మధురలాలస యను పేరుకలది. ఆమెను బాల్యమున నీవు చూచియే యుంటివి. ఆమెయుఁ జిన్ననాటినుండి మీగుణగణాదులను విని మిమ్ములనే వివాహమాడఁదలఁచియున్నది. మీరు కన్పించినప్పటినుండియు విరహానలమునకు గురియై యామె బాధపడుచున్నది. ఆమె బాధను జూడఁజాలక యింతకుముందుగనే యామె చెలికత్తియలు నా కడకు వచ్చి సర్వముఁ జెప్పియున్నారు. వయస్యా! మీకింతకన్నఁ గావలసిన దేమున్నది? ఇఁక మీకార్యసిద్ధి నేతిలోఁ బడినట్లే.

రాజు:—రొట్టెవిఱిగి నేతిలోఁ బడినంతమాత్రమునఁ బ్రయోజనమేమి? అది యనుభవమునకు వచ్చినపుడు గదా దాని ప్రయోజనము?

చెలి:—రాజులు తలఁచిన ననుభవమునకు రాక పోవునా? దీనికింత సందియమేల?

రాజు:—చెలికాఁడా! అంతయు నటుండనిమ్ము. ఆమెను బరిణయమాడుట కభినవకౌముది యంగీకరించునా?

చెలి:—ఆ తల్లి మిగుల సుగుణవతి. ఒరులకష్టమును జూచి సహింపఁజాలదు. ఇఁక మీరీరీతిఁ గష్టపడుచున్నా నామె యెట్లు సహించఁగలదు? మీరు మీ మంత్రులద్వారా యీ వృత్తాంతమును దెల్పితిరేని తప్పక యంగీకరించును.

రాజు:—మంచి యుపాయము చెప్పితివి. అట్లే చేయుదును.

అని చెప్పి యాతనిని బంపివైచి వెంటనే మంత్రులం బిలిపించి వారి కీ వృత్తాంతమును వినిపించి, అభినవకౌముది యంగీకారమును బడసివచ్చుటకై వారిని బంపెను.

మంత్రులు వెంటనే బయలుదేఱి అభినవకౌముది యుండు భవనమునకు వెళ్ళగా నామె వారికి నమస్కరించి యుచితాసనములఁ గూర్చుండఁజేసి "మంత్రిపుంగవులారా! మీరు వచ్చిన కారణమెద్దియో తెల్పుఁ" డని యడిగెను. "మహారాణీ! మన మహారాజుగారు తమకొక విషయము విన్నవింపఁబంపినారు. దానిం జెప్పెద మాలింపుఁడు. క్రముక కంఠోత్తరపురమును బాలించు మదాశయుఁడను రాజునకు

మధురలాలసయను నొకపుత్రిక కలదు. రాజుగారు వేటకై వెడలి యుద్యానవనములోనున్న యా కన్యనుగాంచి మోహించియున్నారు. ఆమెయు కళాపూర్ణని రూపరేఖా విలాసములకుఁ జొక్కి యాతనియందే ప్రేమగలదియై యున్నది. ఆమెను వివాహమాడుటకై మీ యంగీకార మును గోరుచు మమ్ములను మీకడ కంపినారు. కనుక తమ సమ్మతిని దెలుపఁ బ్రార్థించుచున్నార''మని విన్న వించిరి. అపు డామె''మహామంత్రులారా! నేనొరులమనస్సు కష్టపెట్టుదాననుగాను. నా భర్త కభిమతమగు రీతిఁ బ్రవ ర్తించుటయే నాకు సమ్మతము. వారీ విషయములో నన్నింతగఁ గోరవలెనా? అవసరమైన నేనే యందుకు వలయు ప్రయత్నమంతయుఁ జేకుదును. కనుక తాము వెడలి నా యంగీకారమును నా నాథున కెఱిగింపవేడుచున్న దాన'' అని చెప్పి వారిని సబహుమానముగఁ బంపెను.

వారు రాణిగారి కోమలహృదయమునకు మెచ్చు కొనుచు రాజగృహమున కేగి అత్యాతురతతో నెదురుచూచు చున్న రాజును దర్శించి ''మహారాజా! రాణిగారిహృదయము మిగుల మృదువైనది సుమా! మే మివ్వార్త వినిపించు నప్పటికి సంతసముతో 'మంత్రులారా! ప్రియవయస్యుని సంతోషమే నా సంతోషము. అంతకన్న నాకుఁ గావలసిన దేమున్నది! వా రా సుదతిని వివాహమాడి సుఖించుటకు నేనెంతయు సమ్మతించుచున్నదాన. అవసరమైన నేనే యందు లకువలయు ప్రయత్నమంతయు జేయుదాన' నని పలు

మమ్ములను సబహుమానముగాఁ బంపిన” దని విన్నవించిరి. కళాపూర్ణుఁడును నామె గుణమునకు మెచ్చుకొనుచు మహదానందము నొందియుండెను. మంత్రులును రాజానుమతిం బడసి తమ గృహములకు వెడలిరి.

అంత మరునాఁడు కళాపూర్ణుఁడు జ్యోతిష్కుల రావించి ప్రయాణమునకు ముహూర్తమడుగ వా “రీనాఁడే యుత్తమముగనున్న” దని విన్నవించిరి. రాజు వారిని వస్త్రమాల్యాదులచే బహూకరించి, మంత్రులఁ బిలిపించి “ఆర్యులారా! యీ నాఁడే ప్రయాణమున కుత్తమమని జ్యోతిష్కులు సెలవిచ్చియున్నారు. మీరు క్రముక కంఠోత్తరపురమునకు వెడలి మదాశయుని దర్శించి నాకై కన్యక నర్థించి రండు. మీరు మహాప్రాజ్ఞులరు. అచ్చటఁ బలుకవలసిన విధము తమకు తేటుగఁ జెప్పనక్కఱలేదు. ఆతఁడంగీకరించెనేని యచటనే సుముహూర్తమును గూడ నిశ్చయింపుఁడు. ఈ జ్యోతిష్కులుకూడ మీతో వత్తురు. శీఘ్రముగా వెడలి కార్యమును సఫలము చేసికొని రావలసిన” దని యాజ్ఞాపించి పంపెను.

అంతట మంత్రులు జ్యోతిష్కులతోఁగూడ బయలుదేఱి మదాశయమహారాజు దర్శించి తమ నెఱిఁగింపఁగా వినయవిధేయతలతో వారిని సగౌరవముగా బహూకరించి కూర్చుండఁజేసి వచ్చిన కారణము తెల్పుఁడని వేఁడుకొనెను “ఆర్యా! మేము కళాపూర్ణమహారాజునకు మీకుమార్తె నిచ్చి వివాహము చేయ మిమ్ముల నర్థింపవచ్చితిమి” అని మంత్రులు

బదులు చెప్పిరి. వారి మాట వినునప్పటికి మదాశయుఁడు మహదానందమొంది, "పూజ్యులారా! మీ మహారాజునకు నాయందిట్టిదయ కలుగుటకెంతయు సంతసమగుచున్నది. వారి యాజ్ఞకు నేనెప్పుడును బద్ధుఁడనై యుండువాఁడ"ననెను. అంత రూపానుభూతి. మధురలాలసలను బిలిపించి యీ సంతోష వార్త జెప్పినప్పటికి వారును పరమానందమొందిరి. జ్యోతిష్కులు సుముహూర్తము నిర్ణయించి "నేఁటి కైదవదినము గ్రహసంపద కలిగియున్న" దని చెప్పి లగ్నపత్రిక వ్రాసి యీయ మదాశయుఁడు సంతోషముతో దానిని గ్రహించి వారిని వస్త్రాభరణాదులతో సత్కరించెను. వారు మదాశయుని యనుమతింబడసి కాసారపురమునకు వెడలిరి.

కళాపూర్ణుఁడు వారి రాక కెదురుచూచుచుండ మంత్రులు రాజును దర్శించి యీ శుభోదంతమును జెప్పి, మదాశయుని వినయవిధేయతలను వాకొనిరి. కళాపూర్ణుఁడు కార్యము సఫలమైనందుల కెంతయు సంతసించి వివాహ ప్రయత్నములు చేయ మంత్రుల కాజ్ఞాపించెను. పిదప అభినవకౌముదివచ్చి రాజునకు నమస్కరింప నాతఁడు జరిగిన దంతయుఁ జెప్పెను. ఆమెయు సంతసమంది కార్యభారమును దానవహించి సుముహూర్తమునాఁటికి సర్వప్రయత్నములు సిద్ధము చేయించెను.

అంతట నా శుభదినమునకు మంత్రిసామంతాదులతోను, బంధుమిత్రాదులతోను, దాసదాసీజనముతోను బయలుదేఱి క్రముకకంఠోత్తరపురముం జేరి మదాశయునిచే

సత్కరింపఁబడి కళాపూర్ణుఁడు మధురలాలసను మహావైభవముతో నగ్నిసాక్షికముగా వివాహ మాడెను. పిదప మామగారొసంగిన కట్నములంగైకొని మదాలసతోఁగూడఁ గాసారపురమునకువచ్చి బంధుమిత్రాదుల నుచితరీతి సత్కరించి యెల్లర నంపి, అభినవకౌముదీ మధురలాలసలయందు సమానాదరానురాగములుఁ కలవాఁడై దక్షిణనాయకుఁడు నా వాసిఁ గాంచుచుఁ బ్రజానురంజకముగా రాజ్యపాలనముఁ గావించి సమస్తసుఖము లనుభవించెను.



నేను - యికమీదపొరబడను - ఎరుగవెబాలా ॥సుం॥
కనులకన్నీరు గార్చెదవేల ।
ఇన - గంటిపున్నయదాసు - కడతేర్చుబాలా ॥సుం॥
పాపమీకీతి వెదజెందుటేల ।
పాటి - బండ్ల వీరయగురుని - భజియించుబాలా ॥సుం॥
చేతులార జేసికొంటివేల ।
తిరిగి - సేవించుపీరోజి - శ్రీ గురునిబాలా ॥సుం॥

25 శంకరాభరణరాగము - అటతాలము

మాయసంసారమునుదాటు ఉ - పాయమేమిర తమ్ముడా
ఏయుపాయముచేతనో నా - కేమిదెలియునె అక్కరో ॥మా॥
తెలియకుండిన జన్మమెత్తిన - ఫలమదేమిరతమ్ముడా ।
ఫలమొగిలమోరెండుదెలియక, బ్రతుకుచుంటినెఅక్కరో॥ మా॥
కుక్కనక్కలుబ్రతుకలేదా - యెక్కువేమిరతమ్ముడా ।
తక్కువెక్కువలేమిటో అవి - నొక్కిచెప్పవెఅక్కరో ॥మా॥
తిండినిద్రలు భయరతులు ఒక - తీరెగదరా తమ్ముడా ।
ఉండినవి యీనాల్గు అందరి - కొక్కతీరుగ అక్కరో ॥మా॥
జ్ఞానసంపాదనము మానవ - జన్మకెక్కువ తమ్ముడా ।
జ్ఞానమనగానేమిటో నా - కానతివ్వవె అక్కరో ॥మా॥
రాకపోకలులేక జన్మము - రద్దునేయుటతమ్ముడా ।
రాకపోకలులేని మర్మము - నాకుదెల్పవెఅక్కరో ॥మా॥
తనను తాగుర్తించి మోక్ష - స్థానమందుట తమ్ముడా ।
తననుతాగుర్తించగల సా - ధనమదేమో అక్కరో ॥మా॥
శుద్ధమైనబుద్ధియనెడి - అద్దమేగదతమ్ముడా ।
బుద్ధిశుద్ధముజేయగల్గిన - పద్ధతేమేఅక్కరో ॥మా॥

మదములేనిమిది అణచివేసే-మార్గమరయరతమ్ముడా ।
మదపుటేనుగగుంపులవియెటు-మగలిపోవునె అక్కరో ॥మా॥
వ్యసనముల నేడింటిగూల్చే-విషయమెరుగర తమ్ముడా ।
అసదృశంబగు జలధులవినా-కలవిగావే అక్కరో ॥మా॥
అరుగురుశత్రువులబట్టి-హాతము జేయరతమ్ముడా ।
ఘోరరాక్షసబృందమదినే-గొట్టజాలనె అక్కరో ॥మా॥
భ్రాంతులైదిటి నణచివేసే-పద్ధతెరుగర తమ్ముడా ।
వింతదూసర తీగెలవి నా-కంతుదెలియవె అక్కరో ॥మా॥
దుఃఖములనాల్గింటిగూల్చే-త్రోవదెలియరతమ్ముడా ।
దుఃఖములగూర్చుటకునాకెటు-త్రోవదొరుకునెఅక్కరో॥మా।
ఈషణంబులుమూడుద్రుంచే-యిరువుదెలియరా తమ్ముడా
ఈషణంబులు ద్రుంచుటకు నే-నెంతవాడనె అక్కరో ॥మా॥
ఎన్నిజెప్పిన తెలియదంటివి-ఏమిసేయుదు తమ్ముడా ।
ఉన్నవాస్తవమేమిదాయక-విన్నవించితి అక్కరో ॥మా॥
నీదుప్రారబ్ధమునకునే-నేమిసేయుదు తమ్ముడా ।
ఏదిజేసిన నీదెభారము-ఆదరించవె అక్కరో ॥మా॥
అచలపూర్ణ సుబోధయిదిగో-అనుభవించర తమ్ముడా ।
వచనరచనల కందదది నా-వశముగాదె అక్కరో ॥మా॥
సారమా అమనస్కమిదిగో-ఆరగించర తమ్ముడా ।
తారుమారుగనున్నదది నా - తరముగాదే అక్కరో ॥మా॥
అలరుసాంఖ్యవిచారమిదిగో-అందుకొనరా తమ్ముడా ।
పలురకంబుల భావమదినా-కలవిగాదే అక్కరో ॥మా॥
తారకామృత సారమిదిగో-జూరుకొనరా తమ్ముడా ।
దారిడొంకలులేనిదదినా-తరముగాదె అక్కరో ॥మా॥

శోరిసద్గురు నాశ్రయించితే దారిచూపుకును తమ్ముడా ।
ఏదినాకటువంటిగురువులు-యెకుకసరచవె అక్కరో ॥మా॥
ధారుణినియినగంటిపున్నయ-దాసునడుగర తమ్ముడా ।
నోగుపాయిలేని నేనెటు - వారినడుగుదు అక్కరో ॥మా॥
వీరగురుని కటాక్షముండిన-వివరమబ్బును తమ్ముడా ।
భారముంచి భజించెదనునా-ప్రాప్తమాపయి అక్కరో॥మా॥

26 సావేరిరాగము - అటతాళము

ఇదియేమి గొప్పతనమండీ !
మదిని-సదిలముగయోచించి-బదులుజెప్పండీ ॥ఇ॥
బదులుజెప్పెదమని - ఎదుగుబొదుగుదెల్పి ।
అదరించిబెదరించి - వదరకండీ ।
పదిమందిపెద్దలు - భళిరొసెబాపని ।
మదిసంతసింపంగ - మాటలాడండీ ॥ఇ॥
వచ్చివేరుసెనగ - పప్పుభక్షించితె ।
వచ్చేలాభంబేమొ - నచ్చజెప్పండీ ।
పెచ్చుగ పొలములలో - జొచ్చితెగదినె తోక ।
కుచ్చునక్కలకెల్ల - కుదిరినదాబుద్ధి॥ఇ॥
చప్పిడిదిగమ్రింగి - ఉప్పుగారముపులుసు ।
తప్పింపఫలమేమొ - చెప్పరండీ ;
ఉప్పుగారముపులుసు - ఎప్పుడెరుగని అడవి ।
దుప్పులకు కడతేరే - త్రోవదొరికినదా ॥ఇ॥
తెల్లవంచదార - నల్లబర్రెపాలు ।
కొల్లగమ్రింగితే - గుణమేమండీ ।
నల్లగండుచీమ - బొల్లిదున్నకుర్ర ।

మళ్ళిజన్మలులేని — మార్గమడిసినవా ॥ఇ॥
అన్నంబువర్జించి — అరటిపండ్లుదింటె ।
ఉన్నలాభంబేమొ — ఉపమజెప్పండీ ।
ఎన్నిపండ్లయినను — మెగురవేసిమ్రింగి !
తన్నుకొనెకోతులకు — సరియింపుగలదా ॥ఇ॥
ఆరోగ్యమంటెనిని — యనాంకుంచురుముక్తి ।
దారికంటేపెద్ద — లూనుకొనరు ।
ఈరీతిమనపూర్వ — లెవరైనాజేసిరా ।
నేరుపుతోమనమే యివి _ నేర్చుకొన్నామా ॥ఇ॥
భువిని శ్రీ యిసగంటి — పున్నయదాసుడు ।
వివరించితెల్పెడి — విధముదెలియండీ ।
భవరహితుడెపాటి — బాండ్లవిరయగురుని ।
శివజీవైక్యంబెరిగే — స్థితినిగాంచండీ ॥ఇ॥

27 నాదనామక్రియరాగము - అటతాలము

నీవెవడవో నీకు నిజముతెలియకముందే దేవునిదర్శింతువటరా।
ఓ వెర్రిజీవుడా—సావధానంబుగా।భావించినినునీవుగనరా ॥నీ॥
జననమరణములేని — మనసురూపములేని ।
ఘనుడునీకెటుగానబడురా ।
నినునీవుగనుగొన్న—తనకుతానేవచ్చి ।
కనుపించుయిదినమ్ముకొనరా ॥నీ॥
శుకశౌనకవ్యాస—సూతవాల్మీకులే। ఐకటవికటంబైరిగదరా ।
తకతకలగకవికలదర్శ—నంబబ్బునా।తత్వంబుశోధించుకొనరా॥నీ
పరమాత్ముడున్నాడో—మరియు లేకున్నాడో ।
యెరుగనేమెరుగవుగదా ।

హరిహరీ పాపపు-ణ్యములు రెండెరుగని।అర్థంబువ్యర్థమే గదరా॥సీ
నరజన్మమికనీకు-దొరుకునో దొరుకదో ।
త్వరజేసికొనిమేలుకొనరా ।
పరమగోప్యంబైన-పరమాత్మతత్వంబు ।
పరమహంసలవలనగనరా ॥సీ॥
భువిని శ్రీయినగంటి-వున్నయ్యదాసుని-వివరమడిగితెలిసికొనరా
వివరమడిగి తెలిసి-వీరగురుమహిమచే ।
భవహరునిదర్శించుకొనరా ॥సీ॥

## 28 కందార్థములు - పంచరత్నములు

1 నరులారవినుడివినుడీ।నరజన్మము లెత్తిమనమునారాయణుడా।
పరమాత్మునరయనేరక।పరిపరిదుఃఖములమునిగి బాధపడుటేలా
మోక్షముజెందేబాటగనమేల। హరిహర బ్రంహేంద్ర-సురసిద్ధ
సాధ్యకి।న్నరయక్షగంధర్వ వరలకందగరాని । పరమపదమిది
తెలియుటకు మన ।తరముగాదిక గురునిజేరక ।శరణు శరణని-
గురునిసన్నిధి । మరుగుజొచ్చి తరించలేక । బాధపడుటేలా-
మోక్షముజెందే-బాటగనమేలా ॥

2 గురుడనగాబ్రంహ్మసుమీ। గురుడనగావిష్ణుమూర్తి-గురుడు
శివుండున్ ।గురుడు పరబ్రంహ్మము మరి ।గురునకు సాటెవరు
లేరు-గురినిల్పిచూడ । సామాన్యులు-యెరుగరీజాడ।పరమార్థ
మదియెంతో-పరమ రహస్యము।దొరుకదు కనలేని - నరులకు
నిజముగ। పరమపావనమైన సద్గురు । కరుణకై పడిపంచగాచి ।
నిరతమునుగురుసేవజేసే।నరులకనుభవమానుసుమ్మీ।గురినిల్పి
చూడ-సామాన్యులు-యెరుగరీజాడ॥

3. మనకంటె ముందు వారలు । చనిపోయిరి కోట్లకొలది–జనులుః ధరిత్రిన్ । మనయెదుటనెంతకెందరో । చనిపోవుచున్న మాట–సత్యమేగాదా । మనకును చావు–నిత్యమేగాదా । కనుక నే కుక్క–న–క్కల చందమున మనము। తినితిరిగి నిద్రించి-దినములు గడుపక । మునుపు యెచ్చట నున్నవారమొ ॥ పుడమికెందుకు వచ్చినారమొ। యెనసిముందెటుబోవువారమొ । యెరుగకుండిన వ్యర్థ మాట । సత్యమేగాదా–మనకును చావు–నిత్యమేగాదా॥

4. దేవుడు కనబడకుండెను । గావునను న్నాడో లేడో–కనుగొనవలెనా । దేవుడు లేకుండినచో । ఏవిధమున జగములెల్ల –సృష్టిగాబడెను । స్త్రీపురుషుల వ్యష్టిగాబడెను । దేవాది దేవుడో–దేవుడు నిర్గుణుడు । గావున కనబడడు – కర్మజీవులకెపుడు – ఏవిధంబున జూడవలెనో । యెటుల ధ్యానము జేయవలెనో । సావధానముగాగలదు గురు సార్వభౌముని మహిమచేత । సృష్టిగాబడెను–స్త్రీపురుషుల–వ్యష్టిగాబడెను॥

5. గురుసంప్రదాయకుండై –గురుపీఠాధ్యక్షుడైన కోవిధవరుడౌ గురువరునిసమాజకీలక । మెరిగిన సద్భక్తులకును–యిక జన్మలేదు । అటుగాకున్న–నిదియులవిగాదు – వరలెడు శ్రీపాటి–బండ్ల వీరయ గురుని।చరణారవిందసంజనితామృతముగ్రోలి।ధరణిశ్రీయినగంటి పున్నయ । దాసుడొసగిన పంచరత్నము । తెరుకమరుపులులేని చెరగున –స్థిరముగా ముడివేసికొన్న। యికజన్మలేదు_అటుగాకున్న – నిదియులవిగాదు॥

## 29. కందార్థములు – నవరత్నములు

1. జనులార మీరుదేవుని । గనజాలక లేదటంచు–కర్మఠులోనై అనుమానించెదరేటికి। వినుడిక దెల్పెదను మీకు–విశదంబుగాను

దేవునిజూడ-వివరింతునేను। కనకంబుతో జేయు-కంకెలుకాసులు
ఘనమైన ఒడ్డాణాల్ గాజులుగొలుసులు।
మనమునను యోచించి పూర్వపు
కనకమును మరచినవిధంబున। తనవిలాసంబౌప్రపంచము
గనుచు దేవునిమరచినారు। విశదంబుగాను-
దేవునిజాడ వివరింతునేను॥

2. ఏడీదేవుడుగన్పడ। డేడీచూపింపుడనిన-నెటుజూపనగున్
చూడదలంచినవారలు।గాఢంబౌయుక్తి చేత-గమనించవలెను
పరిశోధనము-గావించవలెను।చూడనేరకయున్న లేడేమొగానిఆ
జాడదెలిసితెయున్న - వాడుసర్వమునిండి।
గూఢమైయున్నందునను యే
నాడుగూడ నిజస్వరూపము।చూడకయె గ్రహణంపుచంద్రుని
జూచిరాహువునెరిగినట్లు_గమనించవలెను॥
పరిశోధనము-గావించవలెను॥

3. తనకై తానెప్రపంచము।
జనియించినదే మొయనుచు - సకలవిధములన్
మనసారగయోచించిన।తనకైతావచ్చునట్టి-ధర్మంబులేదు
గారడివానిమర్మంబుగాదు।
కనుగొన్న మన్నునీ-ళ్లునునిప్పుమారుతము
ఘనమాయాకాశము-క్రమముగజనియించె।
వినగనాకసమునగశబ్దం
బనియునిశ్శబ్దబుబ్రహ్మం।బనియు వేదము దెల్పశబ్దము
తనకుతానైవచ్చునట్టి।ధర్మంబులేదు-గారడివాని-మర్మంబుగాదు

4. ఎన్నియుగంబులకైనను।కనులకగపడడదేమి-కారణమనినన్

కన్నులకగపడుసర్వము ।
సున్నగనశించుచుండు-చూచుచుండగనే
స్థిరమైనట్లుతోఁచుచుండగనే ।
ఎన్నడైననుమలిన-మున్న అద్దమునందు
తిన్నగముఖకాంతి-దెలియశక్యంబౌనె।ఉన్నదుర్గుణజాలములువి
చ్ఛిన్నమైవైరాగ్యయుతమై।తిన్ననైనసుబుద్ధివలన ప్ర
సన్నమౌ పరమాత్మరూపము ।
చూచుచుండగనే-స్థిరమైనట్లు-తోఁచుచుండగనే॥
5. ఎప్పుడు దేవుడుగలడని।చెప్పిన వాక్యంబెగాక_చెప్పిరివిబుధుల్
ఎప్పుడొఏవేళనో।తప్పక తానుండడనిరి-ధర్మబోధనచే
హాస్యాస్పదమౌ_కర్మసాధనచే। ఎప్పుడఖండమై-ఏకమైనిత్యమై
గొప్పకొంచములనక-గుణవిలక్షణుడగుచు ।
ఒప్పుచున్నపరాత్పరుని తా
మెప్పటికి గనలేక లేడని-చెప్పుచుండెడిమందమతులకు ।
తప్పకయె తానుండడనిరి ।
ధర్మబోధనచే-హాస్యాస్పదమౌ-కర్మసాధనచే॥
6. కనులకుగనపడుబాహ్యము।
గనినంతపరాత్పరుండు-గానంబడునా
కనబడుజ్ఞానమనియెడి ఘనమగుసాధనము లేక-కల్లమాటలకు
అల్లీబిల్లీ-పిల్లలాటలకు।మనసున వెలలేని-మంత్రాలు తంత్రాలు
గొణుగుచుయెదురుగ-గూర్చుండిచూచిన ।
అణగినవృత్తుల-యందు నూనెయు
పెనగిచేరకున పంచదారయు।మునిగిపాలను నెయ్యివచ్చునె
ముఖ్యమౌ సాధనము లేక।కల్లమాటలకు-అల్లిబిల్లి-పిల్లలాటలకు॥

7 దేవుడు లేడనిమీరలు।గావింపగబోవునట్టి-ఘనకార్యబున్ భావంబలరగ దెల్పిన।ఆవిధమునుజూచిఆర్యు-లానందించెదరు కావలెనన్న-అభినందించెదరు।
ఏ విధంబుననైన-యీప్రపంచమునుండి సావధానంబుగ-సాగిపోవుటకొరకే।జీవులందరు వేచియుండిరి గావునను తరియించుటెట్లో।ఆ విధంబును జూపనేరక-
దేవుడే లేడనినయెవరె।
ట్లానందించెదరు-కావలెనన్న-అభినందించెదరు॥

8. కష్టమొ నిష్ఠురమొ మీయిష్టమెగానిందు దేవు-డే లేకున్న కొ సృష్టికి మూలము జెప్పుడి। స్పష్టంబుగ జెప్పలేరు-సందేహమేలా పనిలేదా మీ కెందుకీ గోలా।
ఇష్టాగోష్ఠిగమీకై - యింకొక్క విధముగ దృష్టాంతమొసగిసందేహంబుదీర్చెద।సృష్టితనకై తానెవచ్చె యి కెవ్వడా దేవుండటన్నను। స్పష్టముగ వేదాంతశాస్త్రము సకల జగము పరాత్పరుండనె।
సందేహమేలా-పనిలేదా మీ-కెందుకీగోలా॥

9. పరమాత్ముడు లేడనియెడి। కొరతనుదీర్చితిని గాన-గురుజన హితులై।సురుచిరమతులై స్థిరముగ।తరియించెడి కవచమిదిగో-ధరియించుకొనుడీ।పలుమారిదియే-స్మరియించుకొనుడీ।వరలెడు శ్రీపాటి-బండ్ల వీరయగురుని।చరణారవింద సం-జనితామృతము గ్రోలి। ధరణి శ్రీ యినగంటి పున్నయ। దాసు డనుభవమెరిగి కూర్చిన। సరసమగు నవరత్నమాల।దొరికెనని శృంగారముగను। ధరియించుకొనుడి-పలుమారిదియే-స్మరియించుకొనుడి॥

30. వరాళిరాగము-ఆటతాళము

రాజ యోగానంద భోగీ !
మోక్ష - రాజ్యాధికార సంతోషసంభోగీ ॥రా॥
వేద వేదాంతంబులో యీ ।
నీకు - విహితగురుబోధ సిద్ధాంతంబులోయీ ॥రా॥
మఠములు మందిరములోయీ ।
నీకు - మాయలంటని హృదయమందిరములోయీ ॥రా॥
కాషాయ వస్త్రంబులోయీ ।
నీకు - గాఢనిద్రను దెలిపే శస్త్రంబులోయీ ॥రా॥
వెలిబూది ధారణమోయీ ।
నీకు - వెలుగులను వెలిగించే కారణమోయీ ॥రా॥
రుద్రాక్ష మాలికలోయీ ।
నీకు - క్షుద్రవిషయములణచే మూలికలోయీ ॥రా॥
దండ కమండలములోయీ ।
నీకు - దండి సూర్యాగ్ని శశిమండలములోయీ ॥రా॥
యోగదండ విశేషమోయీ ।
నీకు - రోగములంటని గురుశేషమోయీ । ॥రా॥
మరిజింక చర్మంబులోయీ ।
నీకు - పరమార్థమును దెల్పే మర్మంబులోయీ ॥రా॥
సిద్ధపద్మాసనము లోయీ ।
నీకు - బుద్ధి చెదరని ఘోర శాసనములోయీ ॥రా॥
పత్ర పుష్పాక్షతలోయీ ।
నీకు - పాపపుణ్యముల వివక్షతలోయీ ॥రా॥
కర్పూరాగరుగంధమోయీ ।

నీకు - కామక్రోధలోభ నిర్బంధమోయీ ॥రా॥
ధూపదీపాంబరములోయీ ।
నీకు - ఓపికగల నిరాడంబరములోయీ ॥రా॥
నారికేళ ఫలంబులోయీ ।
నీకు - కోరికలీడేరే సఫలంబులోయీ
తాంబూల దక్షిణలోయీ ।
నీకు - ధైర్యసాహసశాంత రక్షణలోయీ ॥రా॥
నిత్యనివేదనలోయీ । నీకు-సత్యజ్ఞానాంతసాధనలోయీ ॥రా॥
మంత్రపుష్ప నియోగమోయీ ।
నీకు - మన్మథబాధా పరిత్యాగమోయీ ॥రా॥
హారతీ మంగళములోయీ ।
నీకు - అండపిండాజాండాద్యంగుళములోయీ ॥రా॥
ఘంటాపాత్రోద్ధరణలోయీ ।
నీకు - ఒంటరిగ చరియించే ఆచరణలోయీ ॥రా॥
తీర్థప్రసాదంబులోయీ ।
నీకు - సార్థకమైన గురుపాదంబులోయీ ॥రా॥
పంచాక్షరీమంత్రమోయీ ।
నీకు - సంచితకర్మభంజన యంత్రమోయీ । ॥రా॥
అష్టాక్షరీ జపములోయీ ।
నీకు - కష్టసుఖములకోర్వగల ఉపములోయీ ॥రా॥
హంసరహస్యార్థమోయీ ।
నీకు - సంసారబంధ సంహారార్థమోయీ ॥రా॥
ఖేచరభూచరములోయీ ।
నీకు - సూచకవాచామగోచరములోయీ ॥రా॥

షణ్ముఖమధ్యంబులోయీ ।
నీకు - సచ్చిదానందసారథ్యంబులోయీ ॥రా॥
శాంభవీచిన్ముద్రలోయీ ।
నీకు - శంభువిష్ణు బ్రహ్మాస్తవనిద్రలోయీ ॥రా॥
భూమిమధ్యస్థలవాసమోయీ ।
నీకు - పూర్వకర్మ విమోచనాభాసమోయీ ॥రా॥
దశవిధనాదంబులోయీ ।
నీకు - తత్వశోధక తర్కవాదంబులోయీ ॥రా॥
నాదబిందుకళలోయీ ।
నీకు వాదభేదములేని సాధుకళలోయీ ॥రా॥
కోటిసూర్యవిలాసమోయీ ।
నీకు సాటిలేని జితేంద్రియాభ్యాసమోయీ ॥రా॥
ప్రాణాయామ విధానమోయీ ।
నీకు - బ్రహ్మసాక్షాత్కార ప్రజ్ఞానమోయీ ॥రా॥
కుండలీగమనంబులోయీ ।
నీకు - ఎండమావులభ్రాంతి శమనంబులోయీ ॥రా॥
లంబికాబంధనములోయీ ।
నీకు - అంబరాంతర్గతస్పందనములోయీ ।రా॥
పూరకరేచకములోయీ ।
నీకు - మేరుగిరిసంచార శోచకములోయీ ॥రా॥
లోవెలికుంభకములోయీ ।
నీకు - లోకాతీతసుదర్శనాంబకములోయీ ॥రా॥
ఇడాపింగళదంద్వమోయీ ।
నీకు - ఇహాచింతవిడుశాశ్వతానందమోయీ ॥రా॥

అలరుసుషుమ్న బిలమోయీ ।
నీకు - కలమెలుకువలులేని జ్ఞానబలమోయీ ॥రా॥
షట్చక్ర వివరంబులోయీ ।
నీకు - సకలభూత దయార్ద్ర సారంబులోయీ ॥రా॥
కమలాంతరాంకురములోయీ ।
నీకు జ్ఞానవిజ్ఞానకురాంకురములోయీ ॥రా॥
అంతరకర్ణికలోయీ ।
నీకు - అచలబ్రహ్మధ్యాన చూర్ణికలోయీ ॥రా॥
ఘనసహస్రారాంతమోయీ ।
నీకు - అనుమానరహిత నిశ్చలస్వాంతమోయీ ॥రా॥
ఛాయాపురుషవిధానమోయీ ।
నీకు చావుపుట్టుక లెరిగే సుజ్ఞానమోయీ ॥రా॥
స్వరశాస్త్రసంబంధమోయీ ।
నీకు - సకలంబుగుర్తెరిగె అనుబంధమోయీ ॥రా॥
పంచభూత విభాగమోయీ ।
నీకు - ప్రారబ్ధకర్మనాశనభోగమోయీ ॥రా॥
లింగాంగస్థానంబులోయీ ।
నీకు - సంగవర్జిత పరధ్యానంబులోయీ ॥రా॥
శక్తిముక్తి బ్రహ్మలోయీ ।
నీకు - సర్వసమానజీవ బ్రహ్మలోయీ ॥రా॥
త్రిపుటీరహస్యార్థమోయీ ।
నీకు - కపటనాటక సూత్రగ్రాహ్యార్థమోయీ ॥రా॥
పరమహావాక్యఫలమోయీ ।
నీకు - ఎరుకమరుపులులేని అమృతజలమోయీ ॥రా॥

వాచ్యలక్ష్యాంతరములో యీ ।
నీకు – వరసమాధికి నిరభ్యంతరములో యీ ॥రా॥
పండు వెన్నెల బయలో యీ ।
నీకు – బయలులో బయలెరిగే బట్టబయలో యీ ॥రా॥
పరిపూర్ణమైన బయలో యీ ।
నీకు – మరలతిరిగిరాని మంచిహాయిలో యీ ॥రా॥
ఘనయోగనిష్ఠారతుడో యీ ।
నీకు – ఇనగంటి పున్నయ్యదాసుహితుడో యీ ॥రా॥
పరతత్వదేశవిభుడో యీ ।
నీకు – పాటిబండ్ల వీరగురుడే ప్రభుడో యీ ॥రా॥
దూరముజూచుకొనవో యీ ।
నీకు – వీరోజిబుషిసాక్షి దాచుకొనవో యీ ॥రా॥
శిష్యులు తరించుటలో యీ ।
నీకు – శేషగురుమంత్రము స్మరించుటలో యీ ॥రా॥
గురువులు చరించుటలో యీ ।
నీకు – వరలక్ష్మణార్య నర్చించుటలో యీ ॥రా॥
ఏబదియేడింతవరకో యీ ।
నీకు – ఇలరంగరాజగురుడెంతవరకో యీ ॥రా॥
ఆనందమానందమో యీ ।
నీకు – ఆనందోపనిషద్బ్రహ్మానందమో యీ ॥రా॥

31. కాంభోజిరాగము - అటతాళము-కృతి

కనుగొంటిని-శ్రీవీరగురుని । మనసారనా-కనులకరువుదీర ॥క॥
జననమరణములను-తొలగద్రోసి మోక్ష ।
ధనమొసంగుపూర్ణ-తత్వవేదవిదుని ॥క॥

కోటిసూర్య కాం-తులనుమించిన। వాటమైన-సహస్రార వీధిన
సూటిగా యినగంటి-పున్నయదాసునేలే ।
పాటిబండ్ల వంశ-వార్నిధిచంద్రుని ॥౪॥

32. శ్రీరాగము - అటతాళము

ఓచెలియ నాగురుడు - ఉపదేశమిడెనే
ఉపదేశమిడినన్ను - జపియించుమనెనే
జపియించిపరమాత్మ - జాడగనుమనెనే
జాడగని ఐక్యమై - సాగిపొమ్మనెనే
సాగియిక జన్మలకు - రాగూడదనెనే
రాగూడదనేమాట - రాద్ధాంతమనెనే
రాద్ధాంతమద్వైత - సిద్ధాంతమనెనే
సిద్ధాంతభావార్థ - సిద్ధిగనుమనెనే
ప్రజ్ఞానం బ్రహ్మయని - పలుకుకొమ్మనెనే
పలుకుకొమ్మనెనేనను - కులుకుకొమ్మనెనే
అహంబ్రహ్మాస్మియని - అరచుకొమ్మనెనే
అరచుకొమ్మనెనెనను - తరచుకొమ్మనెనే
తత్వమసియనుమాట - దాచుకొమ్మనెనే
దాచుకొమ్మనెనేనను - జూచుకొమ్మనెనే
అయమాత్మాబ్రహ్మయని - ఆడుకొమ్మనెనే
ఆడుకొమ్మనెనేనను - పాడుకొమ్మనెనే
నామరూపక్రియా - నటనలేదనెనే
నియమనిష్ఠలుమొదలె - నిర్మూలమనెనే
ఏమేమొఅనెనే యిం - కేమేమోయనెనే
నీమాటనామాట - నిజములేదనెనే

ఎరుకమరుపులు రెండు - యేమిలేవనెనే
పరిపూర్ణమైనట్టి - బట్టబయలనెనే
పున్నయ్యదాసుని - బోధవినుమనెనే
చెన్నలరవీరగురు - సిద్ధిగనుమనెనే
పదిరెండు చరణాల - పరమార్థమనెనే
సదయుడౌ వీరోజి - సామ్రాజ్యమనెనే ॥ఓ॥

33. శంకరాభరణరాగము - ఆదితాళము

ఏమిసుందరమో - యీమోహజగము ।
ఏమిసంబరమో । యీమాయసుఖము ॥ఏ।
కామబంధముల - కార్చిచ్చుకణము ।
ప్రేమబంధముల - పెనుబాముఫణము ॥ఏ॥
చిటుకునపొటుకున - సిరిసంపదలు ।
ఫుటుకునయేడ్చుచు-పొరలెడువెతలు ॥చి॥
పటుతరమైతగు - బల యౌవ ।
నములు । కుటిలవిషయసం - ఘటితరోగములు ॥ఏ॥
మతముల కలతలు - మదమత్సరములు ।
బ్రతికెడిజీవుల-బరిమార్చుటలు ॥మ॥
సతతదురాగత - సంపాదనలు ।
అతులకలమారి మ - హోద్భుతకథలు ॥ఏ॥
దిక్కుదిక్కులనుండి-దీనార్తనాదము ।
చక్కబరచలేని - సంసార భేదము ॥ది।
చెక్కుజెదరని - జిగియింద్రజాలము ।
చిక్కుతీగెలవంటి - టక్కుటమారము ॥ఏ॥
భువిని శ్రీయినగంటి - పున్నయ్య గురువరు ।

సువిచార వేదాంత - సూత్రంబెరింగి ॥భు॥
అవనిలో శ్రీ చల్ల - మాంబ బోధించిన ।
వివర మెరింగిన - భవబంధములు లేవు ॥ఏ॥

34. ఆనందభైరవి రాగము- ఆదితాళము (భక్తజనసంకల్పము)
ఆదిమధ్యాంతములు లేని - ఆత్మమూలకారణా
సాధువర్తనానుకూల - సత్యవాక్యపోషణా
వాదభేదరహితముక్తి - భామినీమనోహరా
బోధజేయుపుణ్యమూర్తి - పున్నయార్య గురువరా ॥ఆ॥
వేదశాస్త్రసుప్రమాణ - వాదమంజుభాషణా
క్రోధమేమిలేని శాంత-గుణవికాసభూషణా
నాదబిందుకళా విలక్ష - ణత్రికూటభాసురా
బోధజేయుపుణ్యమూర్తి - పున్నయార్యగురువరా ॥వే॥
సాధనప్రపూర్ణహృదయ - సర్వదోషసంహారా
నీమమహిమ దెలియతరము - గాదు సుగుణసాగరా
బాధామోదసమవిచార - పరమహంసశేఖరా
బోధజేయు పుణ్యమూర్తి - పున్నయార్యగురువరా ॥సా॥
అక్షయప్రబోధితాంత - రార్థతత్వశోధనా
పక్షపాతమేమిలేని - భక్తలోకపాలనా
శిక్షరక్షవీరయార్య - శిష్యజనసుధాకరా
మోక్షమిచ్చి రక్షజేయు - పున్నయార్యగురువరా ॥అ॥
మన్నునీళ్లు నిప్పుగాలి - మిన్ను యీప్రపంచము
ఎన్నటికిని నమ్మరాని - యింద్రజాలచిత్రము
ఉన్ననిజమదేమొదెల్పి - ఉద్ధరించవేమిరా
నిన్నెనమ్మినాముతండ్రి-పున్నయార్యగురువరా ॥మ॥

౩౫. భూపాలరాగము - అటతాళము

రామనామము కల్పవృక్షము-రామనామమునిత్య మోక్షము
రామనామముదీక్ష బూనిన-రాదుయికజన్మం ॥శ్రీరామనామం॥
హరిహర బ్రహ్మలకునైతము-అలవిగాని రహస్యనామము।
గురుకటాక్షముగల్గుభక్తుల-పరమఃయీనామం॥శ్రీరామనామం
కారణాచార్యులనుమరచిన-ఘోరనరకంబైననామము।
మేరుశిఖరముపైనవెలిగే-సారమీనామం ॥శ్రీరామనామం॥
గురునియాజ్ఞనుమీరిపోయిన-పరమదురితంబైననామము
ఎరుకమరుపులమరుగుదెలిసిన-గురుతుయీనామం ॥శ్రీరామనా॥
మతవిభేదపుతగవులాటల-మాటలకు గనరానినామము।
మతములన్నిటియందుగల స-మ్మతముయీనామం ॥శ్రీరామనా॥
వేదశాస్త్రపుకవెలకట్టలు--విప్పినను గనరానినామము।
వేదవేదాంతార్థములలో-వివరమీనామం ॥శ్రీరామనామం॥
పండితులమని శ్రమలుజేసిన-ఫలితమేమియు లేనినామము।
కుండలిని పెకలించినడిపెడి-గోప్యమీనామం ॥శ్రీరామనామం॥
యజ్ఞములుయాగములు జేసిన-అంతుదెలియగ రానినామము
ప్రజ్ఞగలిగిన బ్రహ్మవేత్తల-భావమీనామం ॥శ్రీరామనామం॥
నాదబిందుకళావిశేషని-నాదమై దనరారునామము
వాదభేదవివాదబాధని-వారణమీనామం ॥శ్రీరామనామం॥
సూదిమోపను సందుదొరుకక - సూక్ష్మమైనయనంతనామము
సాధనంబులు నాల్గునేర్చిన-శక్తియీనామం ॥శ్రీరామనామం॥
ఆదిమధ్యాంతములు లేని-మహాప్రసాదంబైననామము ।
సాధుసజ్జన మానసాంబుజ సారమీనామం ॥శ్రీరామనామం॥
ఎన్నిబుట్టిన నెన్నిగిట్టిన - ఎన్నటికి చెడకున్ననామము ।

మిన్నుమన్నుజలానలానిల – మిళితమీనామం శ్రీరామనామం
ధరణిశ్రీయినగంటి పున్నయ–దాస హృదయవిహారనామము।
వరలువీరయ గురువరేణ్యుని–వాక్యమీనామం శ్రీరామనామం
వాసిగాభద్రాచలాగ్ర వి–లాస భాసంబైననామము ।
భాసురంబుగ అప్పికట్ల ని–వాస మీనామం శ్రీరామనామం

36. అసావేరిరాగము - అటతాళము

మాయమాటలుగావురా – మరలజన్మకురావురా।
మరలజన్మకురావురా – తిరిగిజన్మకుబోవురా ।
రేయిబవలును విసుగులేకయె – శ్రీగురుని సేవించరా ॥మా॥
వాదభేదమువద్దురా – వచ్చినది పొరుగూరురా ।
సాధుసజ్జన వర్తనంబున – జరుగుకాలము గడుపరా ॥మా॥
ఎరుకమరుపులు విడువరా – పరమపధమున నడువరా ।
ఇరువు తెరవులు రెండు దెలియని–గురువులతో పనియేమిరా మా॥
అందరెరుగనివట్టురా – కొంద రెరిగినగుట్టురా।
సందుగొందుల కపటభక్తుల – సంతతికి కనికట్టురా ॥మా॥
పెక్కుమాటలేలరా – ఒక్కమాటేచాలురా ।
కుక్కవలెతిరుగాడుమనసును–నొక్కిచక్కగబట్టరా ॥మా॥
కొంటెచేష్టలు మానరా – ఒంటరిగ చరియించరా ।
అంటుబాసిగంటగంటకు – జంటస్వరములు బాడరా ॥మా॥
మూడుకోవలవుట్టరా – కోడెత్రాచులగుట్టరా ।
మోడివేసిన కోడెత్రాచులు – మూడుపడిగెలువిప్పురా ॥మా॥
కుండలిని పెకలించిరా – కొండపై కెక్కించరా ।
పండువెన్నెల బయలులోపల–బట్టబయలును గాంచరా ॥మా॥
కీలకము గుర్తించరా – మేలుకొని జీవించరా ।

నీలతోయదమధ్యనిలచిన – బాలికతో భాషించరా ॥మా॥
మొట్టమొదలేలేదురా – చిట్టచివరయుగాదురా ।
మెట్టవేదాంతములు నేర్చిన – గట్టిగా భ్రమబోదురా ॥మా॥
నీకునీవే దిక్కురా – లోకమెల్ల టక్కురా ।
రాకపోకలులేని బయలున – నీకుగూడచిక్కురా ॥మా॥
స్వానుభవమునుదెల్పరా – శాస్త్రవాక్యమునిల్పరా ।
మానితంబుగ గురునిమంత్రము-మాటికినిజపియించరా ॥మా॥
కోరికలు విడనాడరా – తీరికలు సరిజూడరా ।
ధారుణిని యినగంటివున్నయ – దాసుపాటలు బాడరా ।
మాటిమాటినిదాటరా – మేటిశిఖరపు బాటరా ।
పాటిబండ్ల వీరగురుని – భజనబంగరుమాటరా ॥మా॥
కర్మబంధముద్రుంచరా – మర్మబంధము ద్రెంచరా ।
ధర్మముగ వీరోజిఋషిగురు – ధర్మమును జరిగించరా ॥మా॥

37. మోహనరాగము – ఆదితాళము

శరదింఘవదనావినవే ।
కలికీచిలకలుకొలికీ – అరవిందనయనాగనవే ॥శ॥
ధరణినే జననమొంది – తరచుగా భ్రమలుజెంది ।
పరమార్థ మనగనేమో – గురుతే దెలియనినన్ను ।
కరుణామయుడగునాగురు ।
వరు – శోకతరుణంబందున యిటురమ్మనినా ।
శిరమందునతనదక్షిణకరమిడి-తరియించెదవనిఉపదేశించెను ॥శ॥
కరిరాజగమనా వినవే ।
కొమ్మాఅపరంజిబొమ్మా – వరకుందరదనా గనవే ॥శ॥
హరిహర బ్రహ్మేంద్ర – సురసిద్ధసాధ్యకి ।

